గ్రంథప్రకాశకారకులు

# శ్రీ బొంగరాల వీరాస్వామి నాయుడుగారు బి. ఏ.

పోలీసు సర్కిలు ఇనస్పెక్టరు

తెనాలి.

# కృతజ్ఞత

ఉత్తములతో మైత్రి సుకృతవశాత్తుగాని కలుగదు. కలిగినచో అది త్రికాలములలోను శ్రేయోదాయకమే.

కాకినాడ వాస్తవ్యులు కీ. శే. శ్రీ బొంగరాల అయ్యన్న నాయుడుగారి కుమారులు శ్రీ వీరాస్వామి నాయుడుగారు, బి. ఏ. ఉద్యోగ ధర్మమున తెనాలికి వచ్చినది మొదలు అదృష్టవశాత్తు వారితో నాకు మిక్కిలి స్నేహము కలిగినది. శ్రీ నాయుడుగారి జీవితము ఆదర్శప్రాయము. వారి నిత్య జీవితములో ప్రకటమయ్యే సాధు సద్భావములు అనుసరణీయములు. వారి కుటుంబము భాగవత ధర్మ పరాయణముగా ఆధ్యాత్మిక చింతనితో ధన్య జీవితమును గడుపు చుండును. అవియే మా స్నేహమునకు మూల కారణములు.

శ్రీ నాయుడుగారి ఉదారతా, సహృదయతలు అవ్యాజముగా మా గ్రంథమండలిపై ప్రసరించి ఈ మానవధర్మము, గా సంపుటి అయినవి. కృతి ప్రకటనముతో లోకమునకు మహోపకృతి గావించిన శ్రీ నాయుడుగారికి సాధన గ్రంథమండలి సర్వదా కృతజ్ఞము.

శ్రీ నాయుడుగారికి పరమేశ్వరుడు ఇతోధిక గౌరవోద్యోగ ప్రతిపత్తులను కలుగ జేసి, వారి కుటుంబమునకును, ఆయురారోగ్య ఐశ్వర్యముల నొసగుగాక!

సంపాదకులు

సాధన గ్రంథమండలి.

# ఆశంస

సాధన గ్రంథమండలి పరంపర, నన్ను చాలఆకర్షించి నది. క్రొత్తక్రొత్త సాధనలతో సాధుసమ్మతమై, పవిత్ర మైన జీవిత విధానమును ఉపదేశించుతూ, అది నన్ను బలా త్కారముగా తనవశం చేసుకున్నది. వారి పరమసాధన, భగ వత్ప్రాప్తి-ఉపాయములు, సప్త మహావ్రతములు చాలా పర్యాయములు చదివినాను. అవి నాకు నాజీవిత విధానంలో మహోపకారకము లైనవి. ప్రతివ్యక్తికీ నిత్య జీవితంలో తనం తట తనగమనికకు రాని సూక్ష్మాతి సూక్ష్మ దోషములను గూడ, అద్దములోలాగు చూపి, తన్నివారణోపాయములను బోధించి, ఋజు మార్గమున పెట్ట గలుగుటే, సాధన గ్రంథ మండలి వారి గ్రంథములలోని విశిష్టత.

సాధన గ్రంథమండలి సంపాదకులు, శ్రీ బులుసుసూర్య ప్రకాశశాస్త్రిగారు, నిరాడంబర జీవులు. చక్కని పండితులు సంస్కృతాంధ్ర ములలో మంచి ప్రతిభ గలవారు. ఆధ్యా త్మిక చింతన వారిలో మూర్తీ భవించింది. నాలుగైదు పర్యాయములు కాలినడకతో ఉత్తర దేశమున అన్ని పుణ్య క్షేత్రములను, అన్ని తీర్థములను, సేవించి బదరీనారాయణునికి ఆప్తబంధు కోటిలోకెక్కిన త్రైర్థిక ప్రవరులు. దర్శన స్పర్శనా దపి, అట్టివారు, తోడిలోకమును పునీతము చేయగలుగు టలో ఆశ్చర్యము లేదు గదా! శ్రీ శాస్త్రిలవారి "బదరీ యాత్ర" గ్రంథము ఆద్యంతము అదే ఆశయమును ప్రకటిం చుతూ ఉన్నది.

సంసార యాత్రలో పడి, అనుదినం అంతులేని యాతనలతో అట్టిట్టు లవుతూ ఉండే జీవికి, సులభంగా, ఉత్తమ తరణో పాయము చూపి, చేయూత ఇవ్వ గలిగినది శ్రీ శాస్త్రి గారి కృషి ఈ "మానవధర్మము" తన్నిర్వాహకము. దీనిని ప్రకటపఱచి, నాధర్మమును నేను కొంత వరకు నిర్వహింప గలిగినానని తలచుచున్నాను.

శ్రీ శాస్త్రిగారి కృషికి తగిన చేయూతయిచ్చి, తోటి సహృదయలోకం, సాధన గ్రంథమండలి అభివృద్ధికి, ఇతోధికంగా సాయపడ గలదని ఆశిస్తూన్నాను.

తెనాలి.
26-10-49 } శ్రీ బొంగరాల వీరాస్వామినాయుడు, బి: ఏ:

# అవలంబం

"న హి కల్యాణకృ త్కశ్చి ద్దుర్గతిం తాత! గచ్ఛతి"

అని శ్రీకృష్ణ భగవానుని అవ్యాహతోపదేశం.

"మంచి చేసినవాడు ఎన్నడూ చెడిపోడు"

అనేక జన్మములనుండి పేరుకొని వస్తూ ఉన్న ఎంతటి పాప మైనా, ఏ ఈషణ్మాత్రపు పుణ్యమును అడచివేయ లేదు. అజ్ఞానవశంచేతనే అగుగాక, ఆచరింపబడిన పుణ్యలేశము, ఎంతటి పాపమునైనా, నిష్ఫరవ్వ తూలరాశినివలె, దహించి వేస్తుంది. అంతేగాక, అది అలా తత్కర్తకు గుప్తధనంగా అమరి ఉండి, ఆయా సమయాలలో అనుకూలస్థితిని బట్టి పెరిగి, అతని సొత్తుగా జన్మజన్మముల అతని వెన్నాడి, అవసరపడినప్పుడు, దివ్య మైన అనుభవానికి వస్తుంది. అట్టి పుణ్యమే, కల్యాణ మని గీతాప్రగీత మయింది. అందువలన, అది 'పుణ్యాతిపుణ్యము'గా పరిగణింపబడుతున్నది.

అది యేది? ఎట్లు దానిని సాధించవలె? అన్నది, జిజ్ఞాసువు లైన సాధకుల విధి.

అట్టి కల్యాణత్వము, అనితర మైన ఒక్క భగవద్భావనకు మాత్రమే అన్వయించుతుంది. కామాద్వా, భయాద్వా, క్రోధాద్వా యదృచ్ఛయావా, గృహీతమైన భగవచ్చింతన, తక్షణమే కాక, త్రికాలాలలోను, కల్యాణకర మవుతుంది. అట్టి భావనతోనే దేవుని భావించి, దేవతామూర్తులచే భావింపబడి, మన పూర్వ పూజ్య మహర్షివరులు. అట్టి ఉన్నత స్థితిని పొంది, తేజోమూర్తులై వెలు గొందుతూ ఉన్నారు. వారి వారి ఆచరణములు, వారి వారి పవిత్ర భావనలే, మనకు విహిత ధర్మములు. అవి, భగవదనువాద మైన మనువువే తన సంతతి యైన మానవుల కల్యాణము నపేక్షించి, స్మృతములై ఉన్నవి.

"ధర్మాత్శ్రేయః..." భగవద్గీత

విహిత మైన ధర్మము నాచరింపక, ఏవర్ణములవారికీ, ఎన్నడూ. ఎక్కడా, ఏవిధంగాను, ఏమాత్రమూ శ్రేయస్సు లేదు.

"అతః పుంభి ర్ద్విజశ్రేష్ఠా! వర్ణాశ్రమవిభాగశః.
స్వనుష్ఠితస్య ధర్మస్య సంసిద్ధి ర్హరితోషణమ్."

భాగవతమ్ స్కం ౧

వర్ణాశ్రమవిభాగానుగుణముగా స్వవిహితమైన ధర్మమును లెస్సగా ఆచరించినందులకు ఫలము హరితోషణమే. అదియే పరమకల్యాణమునకు మూలకందము.

నిత్యసత్యాన్వేషణతో, నిర్నిద్రనిరూఢితో, వేదసమ్మత మైన ధర్మము నవలంబించి నిలిచి సాగుతూ ఉన్నందుననే, మన జంబూద్వీపం, అందులోను మన భరతఖండం, యావన్మహీ మండలానికి, మండనాయమానంగా వెలుగొందుతూ ఉన్నది.

ఉత్తమ పద నిశ్రేణులుగా మనుసంగ్రంథితము లైన ఆ ధర్మముల—సయుక్తిక, సవిమర్శక, సరస, సంగ్రథనమే—ఈ. 'మానవధర్మము' మానవధర్మమును చదివి, అవగాహన చేసికొని ఆచరణలో పెట్టక, ఏమానవుడు, నిజమైన మానవత్వమును పొంద లేడు.

'మానవధర్మము' ఒక గేహలీదీపం. ఇది, లోపల, బయట, ఉన్న కాఱుచీకటిని పోగొట్టి; అఖండమైన జ్ఞానదీప్తిని, అంతటా, అన్నివేళలా, ప్రసరింప జేస్తుంది.

ఇట్టి ఉత్తమ మణినిధానమును, చిన్నపుస్తకముగా, శ్రేయోభిముఖమైన మానవలోకమునకు సులువుగా అందజేసిన సాధన గ్రంథమండలి వారు ప్రశంసాపాత్రులు.

కావ్యతీర్థ, కవితావతంస
శ్రీ గట్టి లక్ష్మీ నరసింహ శాస్త్రి
సాహితీ సమితి

తెనాలి
10-10-49

# సాధన గ్రంథ మండలి, తెనాలి.

[ స్థాపితము - 1945 ]

## పోషక వర్గము

### మహారాజ పోషకులు

శ్రీ జిడ్డు లింగయ్యగారు, బందరు.
,, ఈదర వేంకటరావు పంతులుగారు, ఏలూరు.
,, బొంగరాల వీరాస్వామి నాయుడుగారు, కాకినాడ.

### రాజపోషకులు

శ్రీ రూపాకుల శివరామ్‌గారు, కలకత్తా.
,, పాలుట్ల పాలంకయ్యగారు, గుంటూరు.
,, యస్. కె. ప్రకాశరావుగారు, తెనాలి.
,, స్థానం నరసింహారావుగారు, తెనాలి.
,, పులిపాటి వెంకటేశ్వర్లుగారు, తెనాలి.
,, దోనేపూడి వేంకట రమణమూర్తిగారు, కంభం.
,, బొంతా సత్యనారాయణ, సోదరులు. తెనాలి.
,, వేజళ్ల రాఘవయ్యచౌదరీగారు, జూపూడి.
,, కలగర నాగభూషణచౌదరీగారు, ఏలూరు.

### పోషకులు

శ్రీ ప్రభల వీరరాఘవులుగారు, తెనాలి.
,, నేతి హరినారాయణగారు, తెనాలి.
,, పోతుకూచి సుబ్రహ్మణ్యశాస్త్రిగారు, చావలి.
,, త్రిపురమల్లు శ్రీరాములుగారు, తెనాలి.
,, ఘట్టి జగన్నాథంగారు, తెనాలి.
,, దుగ్గిరాల సూర్యనారాయణమూర్తిగారు, తెనాలి.
,, పులిపాటి లక్ష్మీనారాయణగారు, తెనాలి.
,, దేవభక్తుని రత్నయ్యగారు, తెనాలి.
,, పరిమి వేంకట సుబ్బారావుగారు, తెనాలి.
,, గట్టి లక్ష్మీ నరసింహ శాస్త్రిగారు, తెనాలి.
,, జయంతి బుచ్చిరామయ్య శర్మగారు, ముక్తేశ్వరము.
,, పోలిశెట్టి సోమసుందరంగారు, గుంటూరు.

## సభ్యులు

శ్రీ కోటంరాజు కృష్ణారావుగారు, తెనాలి.
,, యాబలూరి ఆదినారాయణశర్మగారు, తెనాలి.
,, ఖండ్రిక సాంబయ్యగారు, తెనాలి.
,, విష్ణుభొట్ల సుబ్రహ్మణ్యంగారు, తెనాలి.
,, వెంపటి సూర్యనారాయణగారు, తెనాలి.
,, ముక్కామల వేంకటాచలపతిరావుగారు, తెనాలి.
,, పిసిపాటి పిచ్చయ్యగారు, ఇంకోలు.
,, ఈదర సూరయ్యగారు, అయితానగరం.
,, ఇసుకపల్లి వేంకట సుబ్రహ్మణ్యశాస్త్రిగారు, గార్లపాడు.
,, కోగంటి తిరుపతయ్యగారు, తెనాలి.
,, గాడేపల్లి వెంకటసుబ్బారావుగారు, తెనాలి.
,, మట్టిగుంట వీరభద్రరావుగారు, తెనాలి.
,, సిరిపురపు శ్రీరాములుగారు, తెనాలి.
,, దోనేపూడి సుబ్రహ్మణ్యముగారు, తెనాలి.
,, బలిజేపల్లి చలపతిరావుగారు, తెనాలి.
,, అన్నదానం శివరామమూర్తిగారు, తెనాలి.
,, ప్రత్తి సూర్యనారాయణగారు, తెనాలి.
,, మాదిరాజు రామదాసుగారు, తెనాలి,
,, అన్నంరాజు మాధవరావుగారు, తెనాలి.
,, ముదిగొండ మృత్యుంజయుడుగారు, తెనాలి.
,, ధారా సీతారామకృష్ణయ్యగారు, తెనాలి.
,, పన్నాల లక్ష్మీనరసింహముగారు, గుంటూరు.
,, గొర్తి పళ్ళయ్యపంతులుగారు, గంగలకుఱ్ఱు (అగ్రహారం)
,, ఉపద్రష్ట వెంకట్రావుగారు, బిలాసపూర్.
,, యస్. వి. వెంకటరమణయ్యగారు, మైసూరు.
,, తాడేపల్లి కేశవశాస్త్రిగారు, తెనాలి.
,, గవిని శాయన్నగారు, జంపని.
,, రామచంద్రుని నరసింహారావుగారు, తెనాలి.
,, కాజ వేంకట జగన్నాధరావుగారు, తెనాలి.

శ్రీ ప్రొప్రైటర్సు సారథీప్రెస్, తెనాలి.
,, పుచ్చా శివరామకృష్ణయ్యగారు, బందరు.
,, పిసిపాటి సత్యనారాయణగారు రేపల్లె.
,, మద్దింశెట్టి బ్రహ్మయ్యగారు, అయినవిల్లి.
,, అల్లవరపు అన్నప్పగారు, ముక్తేశ్వరం.
,, కోడూరి సుబ్బారావుగారు, ముక్తేశ్వరం:
,, వెమళ్ళపల్లి సత్యనారాయణమూర్తిగారు, కొత్తపూరు
(జగన్నాథపురం)
,, అంకం బ్రహ్మడుగారు, తొత్తరమూడి.
,, సలాది బాపయ్యగారు, అనాతవరం.
,, మంథా సుబ్బారావుగారు, అమలాపురం.
,, యం. వి. సుబ్బారావుగారు, అమలాపురం.
,, తాతా కామేశ్వరశర్మగారు, గంగలకుఱ్ఱు (అగ్రహారం)
,, బులుసు పాపయ్యశాస్త్రిగారు, రాజమండ్రి.
,, బులుసు సత్యనారాయణగారు, రాజమండ్రి.
,, శ్రీపాద రామయ్యగారు, కాకినాడ.
,, బులుసు వేంకటేశ్వర్లుగారు, కాకినాడ.
,, చెరువు శివరామకృష్ణశాస్త్రిగారు, విజయవాడ.
,, యస్. శివరామకృష్ణన్, తెనాలి.
,, కొండముది శ్రీరాములుగారు, తెనాలి.
,, ముదిగొండ లింగమూర్తిగారు, తెనాలి.
,, వల్లూరు వేంకటేశ్వర్లుగారు, బాపట్ల.
,, అ. శ్రీనివాసరావుగారు, చీటపాలెం.

* రూపాయిలోపు ఆర్డరులు వి. పి. గా పంపబడవు.
5 రూపాయలనుండి ఆర్డర్లకు పోస్టుఖర్చులు ఉచితము.
వివరములకు:— కేటలాగు

# విషయ సూచిక

# మానవ ధర్మము

## ధర్మావశ్యకత

"ధర్మ స్సతాం హితః పుంసాం
ధర్మ శ్చైవాశ్రయః సతాం
ధర్మా ల్లోకా స్త్రయ స్తాత
ప్రవృత్తా స్సచరాచరాః"

భారతము.

ధర్మము సత్పురుషుని హిత వాక్యము. ధర్మము సత్పురుషుని యాశ్రయము. ముల్లోకములందలి చరాచర వస్తు జాలమంతయు ధర్మమువలననే చలించుచున్నది.

ధర్మశబ్దము "ధృ" అను ధాతువునుండి పుట్టినది. ధర్మధారణము, ధర్మపాలనము, ధర్మప్రచారము, దాని

ముఖ్యార్థములు. సమస్తజీవులకు సంసారమున కల్యాణము చేకూర్చునది ధర్మమని చెప్పబడుచున్నది. ఈ యభిప్రాయమున ప్రత్యయబుద్ధిగల ఋషులు, ధర్మవ్యవస్థ జేసియున్నారు. మానవుడు పుట్టినదాది గతించువరకు చేయుపనులు ధర్మసంబంధము కలవి యనియె హిందూధర్మశాస్త్రములు చెప్పుచున్నవి. ఇది యీనాటి మాటగాదు. ప్రాచీన కాలము నుండియు వచ్చుచున్నది. హిందువుల, సామాజిక, రాజనీతులు ధర్మముకంటె వేరుకాదు. అన్యధర్మమవలంబించిన హిందువు తనధర్మమును మరచుచున్నాడు. మఱియు తాజేయు ప్రతి పనియు నీశ్వరార్పణబుద్ధితో చేసినవానికి పరమాత్మప్రాప్తికి సాధనభూత మగునది ధర్మమె.

ధర్మము నాలుగు విధములు. వర్ణ ధర్మము, ఆశ్రమ ధర్మము, సామాన్య ధర్మము, సాధన ధర్మము.

బ్రాహ్మణాది వర్ణపరిపాలనమున విభిన్నమగు ధర్మము వర్ణధర్మము. బ్రహ్మచర్యాది ఆశ్రమ పాలనమునందు యోగ్య మగునది ఆశ్రమధర్మము. మనుష్యులకు మాత్ర ముపకరించునది సామాన్యధర్మము. దీనినే మానవధర్మ మందురు. ఆత్మజ్ఞాన ప్రాప్తికి ప్రతిబంధకములగు ప్రత్యవాయముల నివృత్తి కొరకు పూనఁబడు నిష్కామకర్మానుష్ఠానమే సాధన ధర్మము.

చతుర్విధ ధర్మములను యథానుసారముగ నాచరించు మానవుడు హిందూధర్మశాస్త్రప్రకారము పరిపూర్ణత్వము పొందగలడని యభిప్రాయము. ఈ నాలుగు ధర్మములలో

నుపేక్షించదగినది యొకటియు లేదు. వర్ణధర్మము, ఆశ్రమ ధర్మము, విభిన్నపురుషులద్వారా భిన్నావస్థలయందు పాలింపబడుచున్నవి. సామాన్యధర్మ పరిపాలన లేనిదే కేవల వర్ణధర్మ, ఆశ్రమ ధర్మపరిపాలన వలన, పరిపూర్ణత్వము కలుగదు. ఈ అభిప్రాయము వలన వర్ణాశ్రమ ధర్మములకన్న సామాన్యధర్మమున మహత్త్వ తక్కువ యని గాదు ఉపేక్షించ తగినదని భావించరాదు. వర్ణాశ్రమ ధర్మములలో నీసామాన్య ధర్మముగూడ సూక్ష్మముగ గలదు. సామాన్యధర్మమన్ని వేళల, నందరించే నాచరింపబడును. గాన అన్నిటి కాధారము కాని వర్ణాశ్రమ ధర్మపరిపాలనమునకు స్థానము. సమయము నుండవలయును. బ్రాహ్మణుడు—శూద్రుని ధర్మము, స్వీకరించరాదు. అట్లె గృహస్థ-సన్యాసిధర్మమును, సన్యాసి—గృహస్థధర్మమును స్వీకరించరాదు. కాని సామాన్యధర్మమాచరించుటకు వర్ణవిచక్షణ లేకుండగ ఆబాల గోపాలము స్త్రీపురుషాదు లందరు నాచరించుట కధికారము గలదు, సామాన్య ధర్మాచరనమువలన, వర్ణాశ్రమ ధర్మాచరణమవసరము లే దని యెవరు భావించరాదు.

కాగా ధర్మమును విడువకుండ యథావిధిగా యోగ్యతానుసారముగ ధర్మాచరణము చేయుచు, దానిని ఈశ్వరార్పణచేసి పరమార్థసాధన కుపయోగించునటుల ప్రవర్తించుట మానవుని కర్తవ్య మని తలచవలయును

శాస్త్రవేత్తలు సామాన్య ధర్మలక్షణముల ననేకవిధములుగ నుడివినారు. ఎనిమిది, పది, పంద్రెండ్రు, పదునాలుగు పదియారు, ఈరీతిగ తలకొక విధముగను నుడివిరి.

శ్రీమద్భాగవత సప్తమస్కంధమున సనాతనధర్మమునకు ముప్పదిలక్షణములు జెప్పబడినవి—

"సత్యం దయా తపః శౌచం తితిక్షేక్షా శమో దమః
అహింసా బ్రహ్మచర్యం చ త్యాగః స్వాధ్యాయ ఆర్జవమ్
సంతోషః సమదృ క్సేవా గ్రామ్యేహోపరమః శనైః
నృణాం విపర్యయేహేక్షా మౌనే మాత్మవిమర్శనమ్..."

భాగవతము 7-11-8-12

సత్యము, దయ, తపస్సు, శౌచము, తితిక్ష, సదసద్వస్తు విచారము, శమము, దమము, అహింస, బ్రహ్మచర్యము, త్యాగము, స్వాధ్యాయము, ఆర్జవము, సంతోషము, సమదృష్టి గల పురుషసేవ, ప్రవృత్తి కర్మలయెడ నివృత్తి, చేయుకర్మల యందు నిష్ఫలతాజ్ఞానము, వ్యర్థప్రలాపన మానుట, ఆత్మ విచారము, భూతదయ, అందరియందు పరమాత్మ సందర్శన భావము, శ్రీహరినామ గుణశ్రవణము, కీర్తనము, స్మరణము, సేవ, పూజనము, నమస్కారము, దాస్యభావము, ఆత్మసమర్పణము—ఈ ముప్పది ధర్మములు మానవుల కందరికి సామాన్య ధర్మము. వీటి పరిపాలన వలన సర్వాత్మస్వరూపుడగు శ్రీహరి ప్రసన్నుడు కాగలడు.

"ధృతిః క్షమా మోద స్తేయం
శౌచ మింద్రియ నిగ్రహః
ధీ ర్విద్యా సత్య మక్రోధో
దశకం ధర్మ లక్షణమ్"

మనుస్మృతి 6-92

ధృతి, క్షమ, దమము, అస్తేయము, శౌచము, ఇంద్రియ నిగ్రహము, బుద్ధి, విద్య, సత్యము, అక్రోధము, ఈపదియు ధర్మలక్షణములు, అని మను వుపదేశించినాడు.

ఏజాతికి, ఏసంప్రదాయమునకును, ఎట్టి హాని కలుగ జేయకుండునదే ధర్మము. ఇదియే మానవజాతికిసహజధర్మము. మానవునియందు మానవత్వము వికాసము పొందవలయునన, ధర్మాచరణము అవసరము. మానవుడు తానెట్టిదశలో నైనను, తన ధర్మమును తా పాలించవలయును. అట్లుకాక యవసరమునుబట్టి ప్రవర్తించిన యధోగతిపాలగును. మనుష్య జాతియందు తన సహజధర్మము వికసించిననాడు లోకము, సుఖశాంతి సామ్రాజ్యములలో సుఖించును—ఎప్పుడు మనుష్య జాతి తన సామాన్యధర్మమును విడచి ప్రవర్తించునో నాడు సుఖశాంతులు లోపించుటయేకాక ప్రతిప్రాణియు స్వార్థమును ప్రధానముగ నెంచును. క్షుద్రమగు స్వార్థమును మాత్రమె యభిలషించిన లోకములో పరస్పరము వైరభావము చెలరేగి హింసాకాండ ప్రారంభమగును. పశువులవలె మానవులు పర స్పరము నశింపజేసుకొనుటకు సిద్ధమగుదురు.

వర్తమానకాలమున సామాన్యధర్మాచరణలోపమున సుఖశాంతులు లోపించి, బుద్ధిమంతుడుకూడ నిత్యము కష్టము నకు గురియగుచున్నాడు. నేడెచట చూచినను దుఃఖదావా నలముచే దేశము క్షుభితమగుచున్నది. ధనవంతునివలన ధనికు నకు, దరిద్రునివలన దరిద్రునకు శాంతిలేదు. దరిద్రునిదుఃఖము బహువిధముల నిత్యము లోకమున సువ్యక్తమగుచున్నది.

ధర్మము మనుష్యుని యాధారము. ధర్మము మానవుని జీవనము. చనిపోయిన తరువాత కూడ ఉత్తమగతికి సాధనము ధర్మమే.

"నాముత్రహి సహాయార్థం పితామాతాచ తిష్టతః
న పుత్రదారా న జ్ఞాతి ధర్మ స్తిష్ఠతి కేవలః
ఏకః ప్రజాయతే జంతుః ఏక యేవ ప్రలీయతే
ఏకోను భుఙ్క్తే సుకృత మేక ఏవచ దుష్కృతమ్
మృతం శరీర ముత్సృజ్య కాష్ఠలోష్ట సమంక్షితౌ
విముఖా బాంధవా యాన్తి ధర్మ స్త మను గచ్ఛతి
తస్మా ద్ధర్మం సహాయార్థం నిత్యం సంచినుయాచ్ఛనైః
ధర్మేణహి సహాయేన తమ స్తరతి దుస్తరం."

మనుస్మృతి 4-239-242

మానవునికి పరలోకమున, తల్లిదండ్రులుగాని, ఆలుబిడ్డలుగాని, బంధుమిత్రులుగాని యెవరును సాయపడరు. ధర్మమొక్కటిమాత్రమే తోడ్పడును. మానవుడు పుట్టినపుడొంటరిగా జన్మించినాడు. పోవునపుడును ఒంటరిగానే పోవును ఎవడు చేసిన పుణ్యపాపములు తానొక్కడే అనుభవించును. బంధుమిత్రులు శ్మశానమువరకు వచ్చి మరలుదురు. ధర్మమొకటిమాత్రమే వెంటరాగలదు. కనుక ప్రాజ్ఞుడు నిత్యము శక్తికొలది పరలోకమున సహాయార్థమై కొద్దికొద్దిగా ధర్మమాచరించవలయును. మానవుడు ధర్మతరణి వలననే ఘోర నరక వారిధిని దాటగలడు.

ధర్మాచరణము తొలుత కఠినముగ కనుపించినను విడువరాదు.

"నసీదన్నపి ధర్మేణ మనోఽధర్మే నివేశయేత్
అధార్మికాణాం పాపానా మాశుపశ్య న్విపర్యయం
నాధర్మశ్చరితో లోకే సద్యః ఫలతి గౌరివ
శనై రావర్తమానస్తు కర్తృ మూలాని కృంతతి
అధర్మే ణైధతే తావత్తో భద్రాణి పశ్యతి
తతః సపత్నా న్జయతి సమూలస్తు వినశ్యతి"

మనుస్మృతి 4-171-174

అధర్మము నాచరించువాడు శీఘ్రముగ చెడ్డవాడగును సామాన్యముగ ధర్మమార్గమున చరించువానికి కష్టము లెక్కువగ సంభవించును. దుఃఖము కలిగినంతమాత్రాన అధర్మమార్గ మవలంబించ రాదు. భూమి వెంటనే యెట్లు ఫలవంతముగాదో, అట్లె సంసారముననుండి యధర్మ మాచరించుచున్నను వెంటనే ఫల మనుభవముగాదు. అధర్మాచరణమున క్రమముగ నాశనము ఘటిల్లును. అధర్మాచరణమువలన ప్రథమమున సుఖము, ఆనందము సంభవించును. తొలుత, అధర్మమువలన తా తలచిన కార్యములన్నియు నెఱవేరి సుఖము కలుగుగాక. సూక్ష్మముగ నాలోచించిన చివరకు సమూలముగ నశించుట నిక్కువము.

కాబట్టి యిట్టిస్థితియంతయు బాగుగ నాలోచించి యెల్లరకు, ధర్మాచరణ మావశ్యముగ భావించి, యాచరింతురుగాక!

మనువు చెప్పిన పూర్వోక్త దశవిధ ధర్మములను క్రమముగ విమర్శించి పర్యాలోచనము చేయుదము.

# ధృతి

మనువు చెప్పిన దశవిధ ధర్మములలో ధృతి మొదటిది. ధృతి యన ధైర్యము. అనగా వికార రాహిత్యము, సహన శీలత.

"నిందంతు నీతినిపుణా యది వా స్తువంతు
లక్ష్మీః సమావిశతు గచ్ఛతు వా యథేష్టమ్,
అద్యైవ వా మరణ మస్తు యుగాన్తరే వా
న్యాయా త్పథః ప్రవిచలన్తి పదం నధీరాః"

భర్తృహరి, నీతిశతకము.

స్తుతించినను నిందించినను సంపద వచ్చినను పోయినను మరణము అప్పుడో లేక మఱొకప్పుడో తప్పని దైనను ధీరులు న్యాయ మార్గమునుండి యెన్నడును చలింపరు.

తా తలచిన ప్రతిపనియు సఫలమగుటకు మానవునకు ధైర్యము ప్రధాన కారణము. ధైర్యము కలవాడు గొప్ప

కష్టములయందును సుఖమునే పొందును. అట్టి వానికి పాపము దూరముగ నుండును. ధైర్యముయొక్క పరీక్ష కష్టకాలముననుకోరిన వస్తువు పొందు టాలస్య మైనపుడును సంభవించును. ఇట్టి సమయమున యెవడు ధైర్య మవలంబించి యుండునో; వాడు తీరని పాపముల నైతము దూరముగ నతిక్రమించి ఇష్ట సిద్ధిని బడయ గలడు. ధైర్యము చెడిన మహా పాపములకు గురి కావలయు.

శారీరములగు కామ, క్రోధ, లోభ, భయ, వ్యసన, వ్యథా, బాధాదికములయందు సామాన్యముగ ధైర్యము చెడును. ఇట్టి సమయములయందే ధైర్య మవసరము.

"వికార హేతౌ సతి విక్రియంతే
యేషాం న చేతాంసి త ఏవ ధీరాః"

మహాకవి కాళిదాసు

వికారము కలిగించు వస్తువు సమీప మందున్నను వికారము నొందనివారే ధీరులు.

సర్వకాల సర్వావస్థలయందు ధైర్యమే మానవునకు శ్రీరామరక్ష. ధైర్యము సత్యమును పాలించును. ధైర్యమే విడచిన హరిశ్చంద్రుడు, మయూర ధ్వజుడు, భీష్ముడు, ధర్మరాజు అర్జునుడు మొదలగు వారి నామము లింతవఱకు నిలచి యుండు నవికావు. ధైర్యము విడువని వానిని భగవంతుడు మిక్కిలి ప్రేమతో జూచును.

వివిధ ధర్మ పరిపాలనమునకు ధైర్యమే, అనగా ధీరత్వమే ప్రధానము. కావుననే మనువు ధైర్యమును ప్రథమ

ధర్మముగ గ్రహించెను. భగవత్ప్రాప్తికి మొదట ప్రారంభించు సాధనమునకు ధైర్యము మిక్కిలి సహాయ కారి. ధైర్యము లేనియెడల మనస్సు వశమున నుండదు. మనస్సు వశమున లేనియెడల భగవత్ప్రాప్తి మిక్కిలి దూర మగును.

భగవంతుని పొంద నభిలషించు సాధకుడు ధృఢమైన నిర్ణయముతో తన సాధనను సాగించిన, అచిర కాలముననే భగవత్సాక్షాత్కారమును బడసి, శాశ్వత మైన ఆనందమును పొందును. అట్లు గాక వికలమైన మనస్సుతో, తన సాధనను విడిచి పుచ్చిన అధీరుడు భగవత్ప్రాప్తికే గాక, ఇహ పర ముల రెంటికి చెడి భ్రష్టు డగును.

"ఇంద్రియాణి ప్రమాథీని హరంతి ప్రసభం మనః
తాని సర్వాణి సంయమ్య యుక్త ఆసీత మత్పరః
వశే హి యస్యేంద్రియాణి తస్య ప్రజ్ఞా ప్రతిష్ఠితా
ధ్యాయతో విషయా న్పుంసః సంగ స్తేషూపజాయతే.
సంగా త్సంజాయతే కామః కామా త్క్రోధో భిజాయతే
క్రోధా ద్భవతి సంమోహః సంమోహా త్స్మృతి విభ్రమః
స్మృతి భ్రంశా ద్బుద్ధినాశో బుద్ధినాశా త్ప్రణశ్యతి.
భగవద్గీత-సాంఖ్యయోగము.

ఇంద్రియములు విక్షేప కరములు. మిక్కిలి పూనికతో భగవ దుపాసన చేయుచు యితర మెరుగక యున్న వాని మనస్సును సైతము అవి తమ వశమునకు త్రిప్పుకొని వికల పఱుప గలవు. కావున సాధకు డగు యోగి వానిని లెస్సగ నియమించి ధృతినిష్ఠుడు కావలయును. ఏలనన ? ఇంద్రియముల వశమందున్న వాని సాధన నిష్ఫల మగును.

ఇంద్రియ సంయమము లేక విషయ చింతనము చేయుచు వికలుడై ధృతి తప్పిన వానికి విషయములయందే తగులాటము తటస్థింపక తప్పదు. అదియే నరక ద్వారమైన సంగము. సంగమలవడిన ఇక చెప్పెడి దేమున్నది? సంగమువలన కామము కలుగును. కామమువలన కలుగు ననర్థములు సాధారణముగ లోకమునకు విదితములే గదా! కామమువలన క్రోధము, క్రోధమువలన అవివేకము, దానివలన స్మృతి భ్రంశము, దానివలన సంపూర్ణముగ నాశము సంభవించును. కావున ఉన్నత స్థితి కోరువాడు ధృతి దొరగక ఆత్మస్థితుడై నిరూఢమగు యోగమున అభిలషితమగు సాధనను అభ్యసింపవలయును.

# క్షమ

మానవ ధర్మములలో క్షమ రెండవది.

"సత్యపి సామర్ధ్యే అపకారసహనం క్షమా"

సామర్ధ్యము కలిగియు అపకారికి తిరిగి యపకారము చేయక సంతోషముగ సహించి యుండుట క్షమ యనబడును. దీనికే సంక్షేపముగ, ఓర్పు అనిపేరు.

మానవుడు మాయా మోహితుడై యుండును. అజ్ఞానముచే భోగములందు సుఖ మున్న దని భావించి, వానిని పొందును. పరిణామ దశను యోజింపడు. స్వార్థము నపేక్షించి, యెదుటి వానికి కీడు గూడ తలపెట్టును. తన మనోవృత్తికి ప్రతికూలముగ నున్న ప్రతివిషయమును మానవుడు తన కనిష్టముగ తలపోయును. దాని వలన క్రోధము పుట్టును. అది క్రమముగ ద్వేషము, వైరము, హింసలుగా రూపములు పొందును.

హృదయమున ద్వేష భావ ముదయించిన దాది యంతయు వానికమంగళమే ఘటించును. "ఒకనిని శత్రువుగ భావించి వాని కపకారము చేయ నెంచిన, వానికిని ఎదుటి వానికిని అనర్థము వాటిల్లును. హృదయమున శాంతి యుండదు. ద్వేషము రగులుచుండును. వారి యుభయుల ద్వేష మంతటితో చల్లారదు. పరస్పరము ప్రతిహింసా భావ మంకురించును. ద్వేషము దావానలముగ మారును. ఈ దావానలము జాతిని, రాష్ట్రములను గూడ నశింప జేయును. ప్రపంచమున యుద్ధములన్నియు నిదే విధముగ సంభవించి, క్రమముగ యావద్దేశ నాశనమునకు కారణము లగుచున్నవి. "ఒకని కపకారముచేసి, వాని వలన తనకు సంభవించు కీడును తప్పించుకొను టెట్లా యని యోజించు తఱి, తాను గూడ నట్టి స్థితిలో నున్న జరుగునదేమి?" అని బుద్ధి మంతుడగు వా, డాలోచింప వలయును.

సామాన్యముగ మనకు సంభవించు చెడు సంఘటన చెడ్డదే యని నిశ్చయముగ చెప్ప జాలము. సూక్ష్మముగ జింతించిన పరిణామావస్థయందు సుఖకరము కావచ్చును. తన మనస్సునకు వ్యతిరేకముగ నున్న పనిని అనిష్టముగ భావించుట మానవ సహజ మనో దౌర్బల్యము. ఇతరులు చేయు పను లన్నియు తన కనుకూలముగ నుండ వనుట నిశ్చయము. అందరి భావములు, మనస్సులు, పరిస్థితులును సమముగ నుండవు. వర్తమానమున ననుకూలముగ నున్నవి కాలాంత రమున వ్యతిరేకముగ నుండవచ్చును ఇతరులు చేయునది తన కనర్థముగ తోచవచ్చును. అది తన స్వార్థమున కనర్థము

కలిగించునేమో, అని తోచ వచ్చును. తన స్వార్థమున కెదుటి వాడు హాని కలిగించ వలెననియే చేసినాడనియు తోచ వచ్చును. ఈయభిప్రాయము నిశ్చితముగ నెవడును చెప్ప జాలడు. ఈవిషయము తరచు వ్యాపారమున బాగుగ అనుభవము కాగలదు. అట్టి యెడ బుద్ధిమంతుడు లెస్సగ మంచి చెడ్డల నారసి సత్క్రమ మార్గమున నడువ వలెను.

ఇతరునివలన హాని కలుగ నున్న దని తోచినపుడు, బుద్ధిమంతు డగువాడు ముఖ్యముగ మూడు విషయముల నాచరణలో బెట్టవలయును. అందు మొదటిది—"అట్లు హాని తలపెట్టిన వానివలన నిజముగ హాని, లేక అనిష్టము జరుగు నున్నదా?" యని విచారించ వలయును. కాని అట్టి సమయ ములలో క్రోధ ద్వేషములకు లోనై, యెట్టి వారును సరియగు నిర్ణయమునకు రాజాలరు.— రెండవది అందువలన, నట్టి తఱి, తనకు నమ్మక మున్న యొక సత్పురుషుని కడ కేగి అది యెఱి గించి, యథార్థము నడుగ వలయును. అతడు లెస్సగా ఆలో చించి,—వాని పూనిక వలన నిజముగ నీ కెట్టి హానియు లేదని నుడివిన, ఇక వైరమునకు స్థానమే యుండబోదు గదా!

ఇంక మూడవది:—అసలు తనపై వానికి అట్టి వైరము నకు కారణమేమి?—అని తనలో తా నాలోచించ వలయును. "కారణము లేనిదే కార్యము పుట్టదు గదా!" అట్టిచో అతడు మన కేల హాని చేయ తలచు చున్నాడు? వానికి నేనెన్నడైనా అనిష్టము చేసియుంటినా? చేయవలయునని మనమున భావించి యైనా యుంటినా? లేక, నాకు తెలియకయే వానికి నష్టము కలుగు పొరపా టెన్నడైనా ఏదైనా, ఆచరించితినా?

ఈ రీతిగా తన్ను తానే పరీక్షించుకొనవలయును. తన యెడల యత్నించి ద్వేషభావము కానరాని యెడల ధైర్యముతో నిట్లు చింతించవలయును—వాడేపరిస్థితిలో నుండి నాకు హాని చేయతలచినాడు? లేక హాని చేయుటయే వాని స్వభావమా? పోనీ, ఏదైనా ఒక సంఘటనకు లోనై ఇట్లాచరించుచున్నాడా? నేనే అట్టి స్థితిలోనున్న చేయునదేమి? వాడు చెడు తలంపుతో చేయదలంచలేదనియు, వాని తాత్కాలిక పరిస్థితియే అట్టి ప్రవృత్తికి దారి తీసినదనియు నిశ్చయమైన, వానియెడల ప్రతీకారమున కధికారమే యుండదు.

నిశ్చయముగ నష్టము కలుగజేయవలయు ననియే వాడట్లు చేసినట్లు తోచిన, భ్రమతో వాడట్లు చేయ తలచెనని భావించవలయును. "లోకమున నెవడితరునికి హాని కలుగ చేయతలచునో వాడు తనకు తానే హాని చేసుకొన తలచినవాడగును. ఇట్టి వానికిని (భ్రమకులోనైన వానికిని) పిచ్చివానికిని భేదము లేదు. ఈయిరువురను క్షమించుటకన్న మఱొక త్రోవ లేదు. అట్లు కాక, వారిని కోపగించి, మందలించినచో, ప్రయోజనము? ఒక వేళ కోపగించిన మనకే కాక లోకమునకు గూడ నష్టము కలుగజేసిన వారమగుదుము.

ఎందువలన? ప్రపంచ మను శరీరములో మనము గూడ నొక యవయవము. ఒక అవయవము విషదూషితమైన ఆవిషము, దేహమంతయు నాక్రమించును. ఇట్టి యెడల తనకును జగత్తునకును, క్షేమము కోరి, యెదిరిని క్షమించుటయే బుద్ధిమంతుని కర్తవ్యము, లక్షణమును. మానవ

సంఘు మీసిద్ధాంత మవలంబించి ప్రవర్తించిన పరస్పరము, క్రోధము, ప్రతిహింస, మున్నగు వానికి తావే యుండదు. ఆ నాడెల్లెడ సుఖ శాంతి చంద్రికలు ప్రసరించి జగము ఆనంద కంద మగును.

కాని తాను ఎదుట వానికి భయపడి కాని, తనకు వీరత్వము లేక కాని, క్షమాప్రార్థన చేయు చున్నట్లు భావించ రాదు. క్షమ, బలవంతునియొక్కయు, వీరునియొక్కయు ధర్మము, లక్షణమును. శత్రువు మాట విన్నంత నే భయపడు వారు, శత్రుహస్తమున దండమును చూచి గృహమున దాగు కొను వారు క్షమింప నసమర్థులు. భయ, క్రోధ, ద్వేష, కౌటిల్యాది వికారములతో వారి హృదయ మెల్లపుడు ఉడికి క్రిందు మీదగు చుండును.

హృదయమున ప్రతిహింసా భావ మే యణుమాత్ర మేని యున్నంతవఱకు, ఇతరునివలన అనిష్టశంక పదే పదే పొడకట్టు చుండును. అద్దానివలన సంపూర్ణ మగు క్షమ అలవడుట కవకాశ ముండదు. కావున, ప్రతిహింసాభావము పూర్తిగ అడగిన గాని, క్షమ ప్రకటము గాదు. అట్లు పొడసూపిన క్షమలో, ఇక ప్రతిహింసకు స్థానమే లేదనుట నిశ్చయము గదా!

భారతీయ ఋషులు క్షమను విశ్వప్రేమగ భావించి, అందలి యానందమును తా మనుభవించి లోకమం దంతట ప్రచారము చేసిరి. క్షమ బలవర్ధకమగు గొప్ప ఓషధి. దీని వలన జీవితము, ఆనందపూర్ణమై సుఖశాంతుల కాలవాల మగును.

"క్రుధ్యంతంన ప్రతిక్రుధ్యే దాక్రుష్టః కుశలం వదేత్"
మనువు.

కోపగించు వాని యెడల కోపము చేయకూడదు. దుర్వచనములు పలుకు వానిని ఆశీర్వదించి; పంపవలయును, అని మను వుపదేశించినాడు.

నవద్వీపమున పూర్వము మాధవ జగన్నాధు లను సోదరులు కలరు. మాధవుడు దురాచారుడు. ఒక దినమున ప్రేమమూర్తి యగు నిత్యానందు డను భక్తుని కొట్టెను. శిరమునుండి రక్తధారలు కారు చుండెను. ఈ విషయమును శ్రీ చైతన్య ప్రభువు వినెను. మాధవుని దండించుటకు యత్నించెను. నిత్యానందు డది తెలిసి, మిక్కిలి చింతించి, శ్రీ చైతన్య ప్రభువు నిట్లు ప్రార్థించెను—

"మహాత్మ! మాధవుని దండించ వద్దు. ప్రభో! నామాట లాలింపుడు. లోకమును రక్షింపుడు. నన్నుద్ధరింపుడు. మాధవు డమాయికుడు. వాని యెడ ప్రేమజూపుడు"

శ్రీచైతన్యుని ఆగ్రహము శాంతించెను. ఈ సంఘటన విన్న మాధవుని హృదయము ప్రేమ మయ మాయెను. వాని జీతము మార్పు చెందెను. వాని హృదయము నుండి, పాప భావము పటాపంచలై పోయినది. క్షమ యిన నిట్లుండవలయును. ద్వేషమను అగ్నికి క్షమ చల్లని నీరు. క్రోధము ప్రతిహింస నేయివంటివి.

సామాన్యముగ, ప్రతి మానవుడును, ముఖ్యముగ మము క్షుత్వ మభిలషించువాడు, ప్రతిహింసా క్రోధములను విడచి, క్షమా సామ్రాజ్యమున పట్టాభిషిక్తుడు కావలయును.

"అద్వేష్టా సర్వభూతానాం మైత్రః కరుణ ఏవ చ
నిర్మమో నిరహంకారః సమదుఃఖ సుఖః క్షమీ"

గీత, భక్తియోగము.

ఏ ప్రాణిని ద్వేషించక కరుణతో మైత్రికలిగి యుండు వాడు, అహం, మమ, అభిమానములకు దూరమైనవాడు, క్షమా శీలుడై ద్వంద్వములను సైచి వికృతి నొందని వాడును, అగు యోగి నా కత్యంత ప్రియుడు.

# దమము

మానవ ధర్మములలో మూడవది దమము. దమ మన ఇంద్రియ నిగ్రహము. పూర్వము చెప్పబడిన పది ధర్మము లలో మనువు ఇంద్రియ నిగ్రహమునుగూర్చి ప్రత్యేకముగ చెప్పుటచే, ప్రస్తుతమున దమ మన మనో నిగ్రహ మని ఎరుగ వలెను.

మనస్సు ఒక విచిత్రపదార్థము. జగమునకు అస్తిత్వము కలిగించును. విషయములయందు మానవుని బంధించును.

"మన ఏవ మనుష్యాణాం కారణం బంధ మోక్షయోః"

మనస్సు కేవలము జడమైనను బంధ మోక్షములకు కారణ భూతము. మానవుడు మనోవిజయము వినా యేదియు బాగుగ జేయలేడు. మనస్సును జయించిన వాడు లోకమును సునాయాసముగ జయించును. మనస్సు మిక్కిలి చంచలమైనది. నిరంతరము విషయాసక్తమై యుండు మనస్సును తద్విముఖ మొనర్చుట మిక్కిలి కష్టతరము.

కాని మనోనిగ్రహమునకు రెండుపాయములు గలవు.

"అభ్యాస వైరాగ్యాభ్యాం తన్నిరోధః"

యోగదర్శనము.

అభ్యాసము, వైరాగ్యము ఈరెంటివలన మనస్సును నిరోధించ వచ్చును. ఈ విషయమునే శ్రీకృష్ణ భగవానుడు కూడ గీతలో నిట్లు చెప్పి యున్నాడు—

"అభ్యాసేనతు కౌంతేయ వైరాగ్యేణ చ గృహ్యతే"

గీత, 6-35

మనోరూపమైన నది ప్రబల ప్రవాహముతో అవివేకము, విషయాసక్తి యను మార్గముల నిరంతరము ప్రవహించుచు సంసార సాగరమున పడుచున్నది. ఈప్రవాహమును ఈశ్వరాభిముఖ మగునటుల చేయవలయును. అందులకు అభ్యాస వైరాగ్యములు రెండే సాధనములు. నదీవేగమును అరికట్టుటకు ఆనకట్ట అవసరము. అంతమాత్రమును చాలదు. నది పొంగి తీరమందలి కొన్ని గ్రామములను నష్టపరచును. అందులకు కాలువలు, వాటినుండి చిన్నకాలువలు, ఏర్పరచిన జలము వ్యర్థముకాకుండ, చక్కగ ప్రవహించుచు దేశమును సుభిక్షము నొనర్చును. ఇట్లే చిత్తమను నదీప్రవాహమును, సంసార సాగరము వైపు నుండి మరలించి, పరమాత్మాభి ముఖము చేయుటకు, అభ్యాస వైరాగ్యములు రెండును ప్రధాన సాధనములు.

సామాన్యముగ లోకమున అణువుమొదలు మేరువు వరకు గల ప్రతిపదార్థమున గల సుఖమున, దుఃఖము—

దోషమును గలవు. ఆపదార్థముయెడ గల ప్రవృత్తిని వైరాగ్య మను త్రాటిచే బంధించవలయును. అట్లు బంధించినను, చిత్తవృత్తి యెప్పుడైన వానివైపుకు మరలవచ్చును. అట్లు మరలకుండ, పరమాత్మవైపు ప్రసరించుటకు నిరంతరము అభ్యాసమను కాలువ లేర్పరచ వలయును. ఈరీతిగా చేయగ చేయగ చిత్తప్రవృత్తి క్రమముగ సాంసారిక విషయ విముఖమై పరిశుద్ధ మగును. అపుడు అట్టి వాని సాధన ఉత్తమ సాధన యగును. ఆనాడు వానికి దృశ్యమాన ప్రపంచ మంతట పరమాత్మ స్వరూపము భాసించును. దీనిమూలమున నిత్యానంద రూపమగు పరమ ధామము పొంద నర్హత గలు గును. ఆనాడు వానిజన్మ కృతార్థత పొందును. మనస్సును వశమున నుంచుకొనని వాడు, భవబంధమునుండి విడివడ లేడు. పరమాత్మ ప్రాప్తికి దూరుడగును. ఈవిషయమున శ్రీకృష్ణ భగవాను డిట్లు చెప్పెను—

"అసం యతాత్మనో యోగో
దుష్ప్రాప ఇతి మే మతిః,
వశ్యాత్మనా తు యతతా
శక్యో ఽవా ప్తు ముపాయతః"

గీత-6-36

ఎవనికి మనస్సు వశమున నుండదో, వానికి పరమాత్మ ప్రాప్తియోగము దూరమగును. మనస్సును వశమం దుంచు కొని ప్రయత్నించువానికి పరమాత్మ ప్రాప్తి తప్పక కలుగును.

కావున మనస్సును దృఢముగ నియమించి, అభ్యాసము —వైరాగ్యము లవలంబించి ప్రయత్నించిన, పరమాత్మ,

తప్పక ప్రాప్తించును. పరమార్థమునకు మార్గ మిదియె సామాన్యముగ సంసార కార్యములందుగూడ మనస్సు వశమందుంచు కొనుట మానవుని ధర్మము. మనస్సు వశమున లేని సంసార సుఖము సుఖము గాదు. చంచలమగు మనస్సు కలవాని కేకార్యమును, యెన్నడును, ఎంతమాత్రమును, సిద్ధింపజాల దనిన, సత్యదూరము కాదు.

# అస్తేయము

మానవ ధర్మములలో అస్తేయము నాల్గవది, ముఖ్యమైనది. స్తేయ మనగా దొంగతనము. అనగా ఇతరుల సొమ్మును అపహరించుట. అది లేకుండుట అస్తేయ మన బడును.

పరుల సొమ్మును, అది బంగారమే అగుగాక, సమలోష్టాశ్మ కాంచనః, అన్నట్లు మంటిబెడ్డతో సమముగా నెంచి దానిపై ఆసక్తి లేకుండవలెను. సామాన్యముగా, దొంగ తనమున కలవాటు పడినవారు అనుభవించు అగౌరవములు, అమర్యాదలు, లోకమున సర్వజన విదితమే.

ఇది యటులుంచి, సాధారణముగా విజ్ఞులైన వారు కూడా, తమకు తెలియకయే స్తేయమునకు గురి యగుచున్నారు. ఈ తరగతికి చెందిన స్తేయము మిక్కిలి ప్రమాదకరము. నరక ద్వారమును, అదెద్దియన?——

అన్ని వర్ణముల వారికిని, ఆయా ధర్మములు విహిత ములై యున్నవిగదా! అది వదలి, పర ధర్మమున కలవాటు పడి సర్వాత్మ భావమున, సర్వభూతములను పరమాత్మగా నెంచుచు తన యనుభవమునకు దొరకిన వస్తువును, ఆకొనిన ఇతరులకు కూడ పంచి యిూక, తానే భుజించుట.

కావున రంతిదేవాదుల నాదర్శముగా నిడుకొని నడచు గృహస్థులు, శ్రేయ మహోఘ సమాహాతికి గురిగారు.

# శౌచము

మానవ ధర్మములలో నైదవది శౌచము. శౌచమన పవిత్రత, ఇది రెండువిధములు. బాహ్యశౌచము, అంతః శౌచము, బాహ్యశౌచమువలన శరీరపవిత్రత, రోగము లేక పోవుట; ఇతరుల పాపములు పరమాణురూపముగ కూడ తన్నంట కుండుటయు, కలుగును. అంతఃశౌచమువలన మనస్సు పవిత్రతనొంది యీశ్వరసాక్షాత్కారమునకు యోగ్యమగును.

మానవజీవితమునకుభగవత్ప్రాప్తియె ప్రధానలక్ష్యము. ఈ యభిప్రాయము మనస్సునం దుంచుకొనియె, త్రికాల ధర్మా చరణులగు ఋషులు ధర్మగ్రంథములం దిట్లు నిర్ణయించిరి. మానవుని ప్రతిపనియు భగవదభిముఖమగును. కొందరు శాస్త్రములకు వ్యతిరేకముగ ప్రవర్తించుచు శాస్త్రకర్తల నాక్షేపించుచుందురు. కొందరు శాస్త్రకారుల కనుయాయుల మని నుడువు చుందురు. ఇట్టివారు శాస్త్రప్రమాణములను తమపాండిత్య విశేషముచే తమ కనుకూలముగ నర్థము చెప్పు

కోను చుందురు. లోకమున నిట్లు విశృంఖలత్వము ప్రబలి నది. ఈకారణముచే భారతదేశము సుఖమునకు, స్వతంత్రతకు నిరామయమునకు దూరమై దుఃఖ భాజన మగుచున్నది. ఇందు వలననే పూర్ణబ్రహ్మనిష్ఠులయొక్కయు, త్యాగులయొక్కయు, మహాత్ములయొక్కయు నివాసములు, వాడిన పుష్పవాటికలై పోయినవి. ఇట్టిదుర్దశ నేడంతట ప్రత్యక్షముగ గోచరించు చున్నది.

శరీరశుద్ధి:—

శరీరశుద్ధి రెండువిధములు. బాహ్యశుద్ధి, అంతఃశుద్ధి— అస్పృశ్యపదార్థముల దాకకుండుట, జలమృత్తికా, గోమయా దులచేశరీరమును స్వచ్ఛముగ జేయుట, బాహ్యశుద్ధి. న్యాయో పార్జిత విత్తముతో శరీరము పోషించి సప్తధాతువులు పవి త్రములుగ జేయుట, యంతఃశుద్ధి. పైరీతిగా శరీరమును శుద్ధి చేయుటను, అనేకులు అన్యాయముగాను, ఆడంబరముగాను వ్యర్థమైన పనిగాను, చేయరానిపనిగాను, భావించుచున్నారు. అస్పృశ్యతా సంబంధములగు శాస్త్రోక్త న్యాయవచనము లను వినువారు లేరు. ఎట్టిపదార్థమునైనను ఇచ్చిపుచ్చుకొనుట లోను, అనుభవించుటలోను పరమాణు రూపముగ దోషము సంక్రమించునని ఎవరును విశ్వసించుట లేదు—గర్భస్థ శిశువుకు తల్లి గుణములన్నియు సంక్రమించును. ఈవిషయమును అందరు నంగీకరించునదే. కాని పరస్పరము తాకుటవలన, ఏకపంక్తి భోజనమువలన, ఏకపాత్ర పానమువలన దోషము కలుగునను విషయము మాత్ర మెవరును అంగీకరింపరు. ఈవిషయమున

దోషముకూడ లేదని వారి యభిప్రాయము. ఇట్లు చేయుటయె గౌరవమని కొందరు భావించుచుండిరి: ఆహా! కాలమహిమ.

మృత్తికా గోమయములచే శరీరమును శుద్ధిచేయుట యసభ్యత్వమని కొందరి భావన. కాని జంతువుల క్రొవ్వుతో తయారైన సబ్బులు, వాడుటవలన దోషమని యెవరును భావింపరు. ఇట్టివస్తువులలోగల పాపములు పరమాణు రూపమున దేహములో ప్రవేశించుటలేదా? వాటివలన నెట్టిపాపము సంక్రమించుటలేదా? వీని నుపయోగించు వారందరు నిది ఉత్తమమనియె పలుకుదురు. జలశుద్ధివిచార మసలే శూన్యమైనది. స్పర్శాస్పర్శవిచార మన్యాయమనియు, అవ్యవహార మనియు జలమృత్తికా వ్యవహారము వ్యర్థాడంబరమనియు తలపబడుచున్నది.

అంతఃశుద్ధి:—

శరీరముయొక్క యంతఃశుద్ధి ప్రధానముగ నాహారము వలన కలుగును. అన్యాయార్జితమైన, ధనముతో, పెట్టు అన్నము దుష్టము. అది సర్వదా అగ్రాహ్యము. ఎట్టి యాహారము భక్షించిన, మనస్సున నట్టి ప్రవృత్తియె కలుగును. మనఃప్రవృత్తి కనుగుణముగనే గుణము లావిర్భవించును గుణానుసారముగానే పనులుండును. క్రమముగ నుత్తరోత్తర పాపప్రవాహము ప్రవహించును. ఇన్నివిషయములు బాగుగ దూరదృష్టిచే నాలోచించియే ఋషు లందరాహారశుద్ధి ప్రధానమని నిర్ణయించిరి.

నేటి భోజనసామాగ్రిలో నెక్కువ అభక్ష్యపదార్థములు, మేళయములు కలయుచున్నవి. ఆంగ్లేయుల సంసర్గము, ఆంగ్ల

విద్యాభ్యాసము మనదేశమున నెక్కువైనకొలది ఆహార పానీయములలో నియమము నశించినది. అట్లు నియమము నశించుటె ప్రధానగౌరవముగా నెంచబడుచున్నది. భారతీయుల ప్రాచీన మర్యాద మిక్కిలి నీచాతినీచముగ పరిగణింప బడుచున్నది. కాబట్టి ప్రాచీన మర్యాదలను పాలించుటలో నందరు సావధాన మనస్కులై ఉండవలయును. శారీర శుద్ధినిగూర్చి శాస్త్రము లనేకవిధములుగా ఘోషించుచున్నవి.

అంతఃకరణశుద్ధి:—

"బ్రహ్మణ్యాత్మార్పణం యత్త
చ్ఛౌచ మాంతరికం స్మృతమ్."

మహానిర్వాణతంత్రము

ఆత్మను బ్రహ్మ యందర్పణము చేయుట యాంతరిక శౌచము. ఎంతవరకు మాంస అస్థి మయమగు నీదేహమున, అహం (నేను) బుద్ధి నశించదో అంతవరకు, అంతః కరణశుద్ధి కాదు. శరీరము నెంత శుభ్రపరచినను అపవిత్రమె. శరీరము నంగల యే పదార్థములోను ఏవిధముగ జూచినను పవిత్రత యనునది కానరాదు. శరీరములో ని రక్తము, మాంసము, మజ్జ, ఎముకలు, చర్మము, మొదలగు పదార్థమేది పవిత్రమైనది? అపవిత్ర పదార్థములచే నిండియున్న ఈతోలు సంచిని మానవుడు తనరూపముగ భావించు చున్నాడు. అదంతయు నపవిత్రమె. ఇట్టి శరీరములో ప్రవేశపెట్టు సుందరములు, సుగంధములు, సురుచిరములు నగు పదార్థములన్నియు నపవిత్రములగుటయె కాక, దుర్గంధములుగాను, అసహ్యములుగాను తయారగు చున్నవి. మధుర పదార్థములన్నియు లోన

ప్రవేశించి విష్టామూత్రములుగా తయారగుచున్నవి. ఇట్టి యపవిత్రమగు శరీరమున "నేన"ను బుద్ధి కలవాఁడు, నాటి న్నటికి నిపవిత్రతముడు గాడు. బాహ్యశుద్ధి, అంతశ్శుద్ధి కల వాని శరీరమందు వానికేగాక, యితరునికి గూడ వైరాగ్య భావము కలుగజేసిన వాడగును. వైరాగ్యమువలన ప్రసన్న త్వము తన్మూలమున ఆత్మసాక్షాత్కారమునకు సహాయము కలుగును.

"శౌచా త్స్వాంగ జుగుప్సా పరైరసంసర్గః"

యోగ, పాద 2 సూ. 40

శౌచము స్థిరమైన తనశరీరమున అసహ్యము, ఇతరు నితో సంసర్గాభావము కలుగును. శరీరమున బాహ్యమున గల దానిని అపవిత్రముగ భావించి పవిత్రముగ చేయును. కాని దానివలన నెన్నటికి నంతఃశౌచము కలుగనేరదు. క్రమ ముగ బాహ్యశౌచ మభ్యాసముచేయగ చేయగ శరీరమప విత్రమనియు, దోషభూయిష్టమనియు విదిత మగును. అప్పుడు శరీరమున నసహ్యభావము జనించును. అది మొదలు, నిత్యము శ్రద్ధతో శరీరమును పవిత్రము గావించుకొనుట ప్రయత్నము నకు మనసు ఉన్ముఖమగును. అంతియేకాక యపవిత్రమగు నితరుని శరీరముతో సంసర్గము పూర్తిగా విడువవలయు నను భావము నిశ్చయముగ కలుగును.

ఆంతరంగిక శౌచమును గూర్చి పతంజలి మహాముని యిట్లు చెప్పెను.

"సత్త్వశుద్ధి సౌమనస్యైకాగ్ర్యేం
ద్రియ జయాత్మదర్శన యోగ్యత్వానిచ"

యోగ పాద. 2 సూత్ర. 41

శౌచస్థిరత్వమువలన సత్త్వశుద్ధి, ప్రసన్నత, ఏకాగ్రత, ఇంద్రియ విజయము, ఆత్మసాక్షాత్కార యోగ్యతయు ప్రాప్తించును.

ఆంతరిక శుద్ధిసాధనాచరణమువలన అంతఃకరణమందలి రాగద్వేషములు నశించును. అందువలన రజోగుణము, తమోగుణములు తగ్గును. సత్త్వగుణ మధికమగును. చిత్తము నిర్మలమగును. నిర్మలతవలన ప్రసన్నత యావిర్భవించును ప్రసన్నత్వమువలన విక్షేపములు నశించి ఏకాగ్రత సిద్ధించును. ఏకాగ్రతవలన మనస్సు స్వాధీనమగును, అప్పుడు సుకరముగ నింద్రియజయము సంప్రాప్తించును. ఈరీతిగ పవిత్రమగు సూక్ష్మవస్తుగ్రహణము మనసెప్పుడు గ్రహించునో, అపుడాత్మ ధర్మమునకు యోగ్యత కలుగును. శౌచముయొక్క శుభపరిణామ మిది. ప్రాచీనకాలమున ఋషులందరు నిట్టి ఫలము నపేక్షించినారు. మనమున కామక్రోధా ద్యరిషడ్వర్గములు, హింస, స్తేయ, వ్యభిచారాది దోషములు నశించక బాహ్యశౌచమున ప్రయోజన మిసుమంతయు లేదు. అట్టివాని స్నానములు గజస్నానములే. వీనికంటె కామక్రోధా ద్యరిషడ్వర్గములు, ఇతరదోషములు, హృదయమునుండి తొలగించి, ఒకచోటకూర్చుని ధ్యానముచేయువాడే ఉత్తముడు. ఆత్మ నిరీక్షణమునకు శరీరశుద్ధికంటె ఆంతరంగ పవిత్రత

ప్రధానము. అంతఃకరణ పవిత్రత వలన బాహ్యశౌచముగూడ సిద్ధించగలదు.

"ఆత్మానదీ సంయమ పుణ్యతీర్థా
సత్యోదకా శీలతటా దయోర్మిః
తత్రాభిషేకం కురుపాండుపుత్ర!
నవారిణా శుద్ధ్యతి చాంతరాత్మా"

సంయమమను పుణ్యతీర్థము సత్యరూపమగు జలము, శీలరూపమగు తటము, దయయను తరంగములు గల ఆత్మ రూపమగు నదిలో స్నానము చేయనిదే పవిత్రత యెట్లు సిద్ధించును? అంతరాత్మ జలముచే పరిశుద్ధము కాదు. కాగా మన శ్శుద్ధి కోరువాడు నిరంతరము, ఆత్మవిచారము చేయుచు, ఇంద్రియసంయమనము కలిగి, సత్య, శీల, దయాది గుణములు కలిగి ప్రవర్తించవలయును.

మైత్రి, కరుణ, ముదిత, ఉపేక్షయను నాలుగును ఆత్మ శుద్ధికి సహేతుభూతములగు నని పతంజలి మహాముని చెప్పి యున్నాడు.

"మైత్రీ కరుణా ముదితో పేక్షాణాం
సుఖదుఃఖ పుణ్యాపుణ్య విషయాణాం
భావనాత శ్చిత్త ప్రసాదనమ్"

యోగ. పాద. 1 సూ. 33

సుఖ వంతులవిషయమై ప్రేమ, దుఃఖవంతులయెడ దయ, పుణ్యాత్ములగూర్చి ప్రసన్నత, పాపాత్ములయెడ ఔదా సీన్యము కలిగియుండుట వలన చిత్తము ప్రసన్నత్వము పొందును.

(క)

లోకమునంగల సుఖవంతులయెడ ప్రేమ చూపుటవలన చిత్తమందలి ఈర్ష్యయను మలము దూరమగును. ద్వేషాగ్ని చల్లారును. ఆత్మీయుల నందరిని గూడ ప్రేమగజూచును. తన వారు, ఇతరులు, అను భేదబుద్ధి నశించును. ఈరీతిగా సర్వుల యందు సమానమగు ప్రేమ చూపిన అంతయు నానంద మయమె. ఇతరుని సుఖముజూచి నిర్మలమనస్సుతో తా నా నందించుభావ ముదయించును.

(ఖ)

దుఃఖవంతులగూర్చి దయచూపుటవలన మనస్సునందలి అపకారరూపమగు మలము నశించును. తాను కష్టములను సహించును. కష్టములవిషయ మితరులకు చెప్ప నవసరముండదు. రాబోవు కష్టములనుగూర్చి నేటిలగాయతు నివారణోపాయము వెదకుచుండును. ఇట్లె పరులవిషయమునగూడ తాను ప్రయత్నించుచున్న ఎవనికిని దుఃఖమనునది యుండదు. ఇతరుల దుఃఖనివారణకొరకు తనసర్వస్వము సమర్పించుటకు సంసిద్ధుడగును. ఆనాడు లోకమున నెవరునుగూడ దుఃఖము నకు లక్ష్యముకారు.

(గ)

ధర్మాత్ములజూచి సంతసించుటవలన మనస్సునందలి దోషారోపముచేయుట యను అసూయామలము నశించును. ధర్మాత్ములవలె తన మనస్సుకూడా సదా ధర్మబుద్ధిచే సంత సించుచుండును. ధర్మబుద్ధి స్థిరమగును. అసూయ నశించుట వలన చిత్తము ప్రశాంతముగ నుండును.

(ఘ)

పాపాత్ములను ఉపేక్షించుటచే మనస్సునందలి క్రోధ రూపమగు మలము నశించును. హృదయమునుండి పాపచింతన దూరమగును. అంతఃకరణ పవిత్రమగును. నిందాభావ మెన్నడును కలుగదు. ఇందువలన చిత్తము ప్రశాంతమగును.

ఈరీతిగ పైనాలుగు సాధనములవలన అంతఃకరణము మిక్కిలి పరిశుద్ధిపొందును. మోక్షార్థియగువాడు శౌచము పరమావశ్యక ధర్మముగ గ్రహించవలయును. దానిని పూర్తిగ పరిపాలించుటకు బాహ్యశౌచ మత్యవసరము. కాగానీరెండును ముఖ్యావశ్యకములు.

సామాన్యముగ శౌచ మైదు విధములుగ విభజింప బడినది.

"మనఃశౌచం కర్మశౌచం
కులశౌచం చ భారత!
శరీరశౌచం వాక్శౌచం
శౌచం పంచవిధం స్మృతమ్."

మనస్సు, కర్మ, కులము, శరీరము, వాక్కు యీాఐదును పవిత్రముకలిగి యుండవలయును.

మనస్సు:—

అభిమానము, వైరము, ద్వేషము, హింస, దంభము కామము, క్రోధము, లోభము, ఈర్ష్య వీటిచే మనస్సు అపవిత్రమగును. సాధ్య మైనంతవరకు ప్రయత్నపూర్వకముగ దోషములను పోగొట్టుటకు ప్రయత్నించవలయును.

కర్మ:—

కోరిక, ద్వేషము, దంభము, లోభము, అభిమానము వీటివలన శాస్త్రవిరుద్ధమగు అపవిత్ర కర్మాచరణము జరుగును. కాబట్టి లోకసేవాభావముతో ప్రతి పనియు భగవ దర్పణ బుద్ధితో నాచరించుటయే కర్మ శౌచమనబడును.

కులము:—

వ్యభిచారము, వ్యర్థసంభాషణ మొదలగు గుణములచే కులము సంకర మొంది, పరస్పరము మర్యాద నశించి వంశమ పవిత్రమగును. కాబట్టి పై దోషములు లేకుండగ వంశమర్యాదను రక్షించుట కుల శౌచ మనబడును.

శరీరము:—

అస్పృశ్య పదార్థములను స్పృశించుట, మృతజాతా శౌచములను పరిత్యజించుట, మలమూత్రములను యథా యోగ్యముగ విడువకుండుట యీకారణములచే శరీర మప విత్రమగును. స్నాన సమయమున మృత్తికచే శరీరమును శుద్ధి చేయుట, స్నానము, ఆచమనము యీమొదలగువాటిచే శరీ రము పవిత్రమగును. ఇదియే శరీర శౌచము.

వాక్కు:—

అసత్యము, కటుభాషణము, పరనింద, స్వోత్కర్ష, వ్యర్థ సంభాషణము యీమొదలగు వాటిచే వాక్కు అపవిత్రమగును. ఈకారణముచే నెల్లప్పుడు వికార రహితముగా మాట్లాడుట వాక్శౌచ మనబడును

సాధకునకు శౌచము సర్వోత్తమమైన ఉపాయము. దీనికి తోడు సదా ప్రేమతో భగవన్నామోచ్చారణము చేయు

చుండవలయును. పూర్వోక్త ప్రకారముగ శాస్త్రానుసారముగ శౌచమును పాలించుచు, భగవంతుని పూజించుచు స్మరించుట కూడ శీఘ్రముగ నీశ్వరసాక్షాత్కారమునకు ప్రధానకారణము.

"అపవిత్రః పవిత్రోవా
సర్వావస్థాం గతోఽపివా
యః స్మరేత్పుండరీకాక్షం
సబాహ్యాభ్యంతరః శుచిః"

# ఇంద్రియ నిగ్రహము

మానవ ధర్మములలో నారవది యింద్రియనిగ్రహము. ఇంద్రియములను ఎల్లప్పు డెట్టి చెడువ్యాపారమున సంలగ్నముకాకుండ తన వశమందుంచుకొనుట యింద్రియ నిగ్రహమనబడును.

"ఇంద్రియాణాం ప్రసంగేన దోషమృచ్ఛ త్యసంశయం
సంనియమ్యతు తాన్యేవ తతస్సింద్ధిం నియచ్ఛతి"

మానవు డింద్రియములను విషయ సంలగ్నమొనర్చిన నిశ్చయముగ దోషమును చెందును. ఇంద్రియములను వశమందుంచుకొన్నయెడల పరమసిద్ధి సంప్రాప్తించును. ఇంద్రియములకు వశవర్తియై యుండువాడు వివిధ పాపములయందు చిక్కుకొని, వివిధ కష్టముల ననుభవించుటయె కాక, ఇతరులనుగూడ కష్టపెట్టును. ఇంద్రియ లోలుడగు వాడెట్టి చెడు పని యాచరించుటకు, వెనుదీయడు. ఇందువలన యితరులు వీనిని జూచి క్రూరజంతువువలన భయపడునట్లు భయమొందు

చుందురు. సుఖ మందాసక్తిగల స్త్రీపురుషులు తమ యింద్రియములను స్వేచ్ఛగ ప్రవర్తింపజేయ జనదు. ఇంద్రియములు వశ మందుండని యెడల చెప్పుట కలవికాని పాపములనుండి తప్పించుకొనజాలరు. ముఖ్యముగ భగవత్ప్రాప్తియగు పరమ సుఖ ధామము పొందగోరు వారలకింద్రియ నిగ్రహ మవశ్య కర్తవ్యమని భావించవలయును.

జ్ఞానేంద్రియము లైదు. శ్రవణము, త్వక్, చక్షుస్సు, రసన, ఘ్రాణము, అని. క్రమముగ నీయైదింద్రియములు శబ్ద, స్పర్శ, రూప, రస, గంధములను నైదువిషయములందే ప్రవర్తించును. అంతకన్న విభిన్నవిషయములను యింద్రియములు గ్రహింపనేరవు. ఇంద్రియములన శరీరమునకు సంబంధించిన ముక్కు, చెవి మొదలగు అవయవముల పేర్లుకాని, వాని యాకారములుగాని కావు. వానియందుండు శక్తిని యింద్రియములందురు. ఈ జ్ఞానేంద్రియము లైదింటికి సహాయకము లగు కర్మేంద్రియములైదు గలవు—చేతులు, కాళ్ళు, వాక్కు పృష్టము, ఉపస్థ ఈపదింద్రియములయందు జ్ఞానేంద్రియమగు రసనేంద్రియమునకు, కర్మేంద్రియమగు వాగింద్రియమునకు నాలు కొక్కటె స్థానము. కర్మేంద్రియములకంటె జ్ఞానేంద్రియములు సూక్ష్మములు శ్రేష్టములు నైయున్నవి. జ్ఞానేంద్రియములు వశ మందున్నయెడల కర్మేంద్రియములు స్వయముగనే వశమగును. ఇంద్రియము లెల్లప్పుడు మనస్సును విషయ వాసనలయందు సంలగ్న మొనర్చుచుండును. మానవు డీయైదింద్రియములలో నే ఒక యింద్రియమునకు వశవర్తియైనను

మిక్కిలి యనర్థమును పొందును. అట్టితరి యైదింద్రియములకు వశుడైన పతనము చెందు ననుటలో సందేహమేమి?

ఒక్కొక విషయమందాసక్తి గలిగియుండుటచే నెట్టి యనర్థము సంప్రాప్తించునో ఈదిగువ దృష్టాంతమువలన తెలియును.

"వనకరి చిక్కె మైనసకు వాచవికిం జెడిబోయె మీను, తా
వినికికిఁ జిక్కెఁ జిల్వ గనువేదుఱు జెందెను లేళ్ళు తావిలో
మనకి నశించె దేఁటి, తరమా యిరుమూఁటిని గెల్వ నైదు సా
ధనముల నీవె కావఁదగు దాశరథీ కరుణాపయోనిధీ"

దాశరథీ శతకము

శబ్దము:—

శబ్దము, లేక ధ్వని కర్ణేంద్రియమువలన గోచరమగును. లేడికి వీణానాదము మిక్కిలి ప్రియతమము. కిరాతులడవులకు జని మృదుమధురముగ వీణ వాయింతురు. ఆధ్వని వినినంత నే నలువైపులనుండి లేళ్ళు వారిసన్నిధికి చేరి ఆవీణానాదమున సంలగ్న మనస్సుకలవై యుండును. అట్టితఱి పార్శ్వవర్తులగు వ్యాధులు వాటిని చంపివేతురు. ఇది కేవల కర్ణేంద్రియము నకు వశవర్తియగుటకు ఫలితము.

స్పర్శ:—

స్పర్శజ్ఞానము త్వగింద్రియమువలన కలుగును ఏనుగులను పట్టుకొనువారడవులలో లోతైన గొయ్యితీసి, దానిపై సామాన్యకఱ్ఱలు వేసి పలుచగమన్ను పరచి, దానిపై కృత్రిమమగు ఆడఏనుగునుంచి, చెట్లపైనెక్కి ఏనుగువలె ఘీంకార ధ్వనులు చేయగ, ఏనుగు పరుగెత్తివచ్చి కృత్రిమయేనుగు

యొక్క స్పర్శను అభిలషించి, ఆడయేనుగు చేరబోయి గోతిలో పడును. వ్యాధులు క్రమముగ దానిని బలిష్టమగు ఇనుపగొలుసులతో బంధింతురు. ఒక్క స్పర్శేంద్రియమునకు లోబడియుండుటవలన, అరణ్యమున నిర్భయముగ సంచరించు బలవద్గజరాజముకూడ బంధింప బడుచున్నది.

రూపము:—

ఇది చక్షురింద్రియమువలన జనించును. శలభము దీపపుకాంతిని చూచి మోహితయగును. వేలకొలది శలభములు దీపమునందు పడి మడియుట జూచును. మిగిలినవి కూడ రూపమందుగల ఆసక్తి వాటిని బలవంతముగ దీపము వైపున కాకర్షింప జేయును. పాపము! దీపమందుపడి భస్మమగును. కేవల చక్షురింద్రియమునందే ఆసక్తి కలిగియుండుటకు ఫలము.

రసము:—

ఇది జిహ్వవలన కలుగును. మీనము జిహ్వాచాపల్యము వలన జలమునుండి విడివడి చనిపోవుచున్నది. మత్స్యముబట్టువారు సన్నని కఱ్ఱకు త్రాడుకట్టి దానిచివర యినుపగాలమును బంధించి, దానికి మాంసము గ్రుచ్చి నీటిలో బడవేతురు. మీనము దానిని తిను నాశతో పరువెత్తి వచ్చి, మాంసమును తాకగనే గాలము కంఠమున తగుల్కొనును. వెంటనె జాలరి బయటికిలాగును. మత్స్యము మరణించును. కేవల రసనేంద్రియమునకు వశవర్తి యగుటవలన మీనము మడియుచున్నది.

గంధము;—

ఇది ఘ్రాణేంద్రియమువలన పుట్టును. తుమ్మెద సుగంధప్రణయి. అది పద్మములో ప్రవేశించి సుగంధాసక్త చిత్తయై

శరీరసమ్మృతి గోల్పోవును. సూర్యు డస్తాద్రిచేరిన అరవిందము ముకుళించుకొని పోవును. భ్రమరము కమలములో కై దీయగను బలిష్టమగు కట్టనుగూడ రంధ్రముచేయు షట్పదము సుగంధ లోలుపతచే పద్మములో చిక్కుకొని, సుకుమార పద్మదళము లనుగూడ భేదించుట కసమర్థయగు చున్నది. అట్టితఱి గజము వచ్చి తొండముతో నా పద్మమును లాగి కాలిక్రిందపెట్టి నులి మివేయుచున్నది. భ్రమరము చచ్చుచున్నది. కేవల ఘ్రాణేం ద్రియాసక్త చిత్తయగుటవల నకలుగు ఫలితమిది.

ఇట్టిస్థితిలో కర్తవ్యమేమి ? యనునది విచారణీయాం శము. విషయములను గ్రహించుటే ఇంద్రియములపని. ఇంద్రి యము లున్నంతవరకు, విషయగ్రహణము జరుగుచునే యుండును. ఇంద్రియములను విషయగ్రహణమునుండి మరల్ప జాలము. ఒకవేళ, మరల్తుమేపో, జీవయాత్ర కఠిన తరమగును. యింద్రియము లేకున్నను కష్టమే.

ఇందువలన ఇంద్రియ నాశన మవసరము లేదు. ఇంద్రి యము లుండుటే అత్యావశ్యకము. భగవంతుడు మనలాభము కొరకే యింద్రియములను మన కనుగ్రహించెను. విషయా సక్తిచే నింద్రియములను దురుపయోగ మొనర్చిన మనది పొరపాటు. నియమ పూర్వకముగ వానిని సదుపయోగ మొన ర్చిన యథార్థమగు లాభమును పొందుదుము. ఏ యింద్రియ మెందు కవసరము? దేనితో నేకార్యము చేయవచ్చును? ఏ కార్యము చేయకూడదు? ఈ విషయమునుగూర్చి క్రమముగ నీక్రింద విమర్శింప బడుచున్నది.

శ్రోత్రము; ప్రయోజనము:—

శ్రోత్రమువలన శబ్దజ్ఞానము కలుగును. చెవిటివాడు మంచిమాటలను, అవసరములగు ఇతరవిషయములను వినజాలడు. అట్టివాడు లౌకికోన్నతి గాని, పారలౌకికోన్నతి గాని చెందజాలడు.

శ్రోత్రము; నష్టము:—

తన గొప్పతనమును వినగూడదు. ఇందువలన అహంకార మభివృద్ధి యగును. ఇతరుల నిందను వినగూడదు. ఇందుచే న్నసహ్యాము, ద్వేషము, క్రోధము, వైరము మొదలగు దోషము లుద్భవించును. మరియు నితరుల పాపసంస్కారములు మనస్సున ప్రవేశించును. ఇతరుల చర్చ, అక్కరకు మాలిన మాటలు వినగూడదు. దీనివలన సమయము వ్యర్థ మగును. స్తుతి నిందలకు సదవకాశము లభించును. తన నోటినుండి యసత్యములు వెలువడును. దినచర్యకూడ చెడును. భగవంతునియొక్కయు, దేవతలయొక్కయు, గురువులయొక్కయు సత్పురుషులయొక్కయు, శాస్త్రములయొక్కయు, నింద వినరాదు. ఇందువలన అశ్రద్ధ అపనమ్మకము వృద్ధిచెందును. ఆస్తిక్యబుద్ధి నశించును. పాపము కలుగును. సాధన చెడును. అశ్లీల వాక్యములను, శృంగార రసగ్రంథములను, వేశ్యాగానమును, చెడునాటకములను, చెడ్డ యాటలయందలి హితమును, స్త్రీవిషయకమగు మాటలను, దుష్ట ఉపన్యాసములను వినగూడదు. వీనివలన మనస్సున వికార ముద్భవించును. మనశ్చాంచల్యము వృద్ధి యగును. విలాసత్వ ముదయించును. ధనము నశించును. భగవంతుడు, ధర్మము, దేశము, జాతి,

కుటుంబము మొదలగు వానినుండి మనస్సు తొలగును. వ్యభిచార భావముగూడ ఉదయించును. తనయందు ద్వేషభావము కలవానిచర్చ వినరాదు. దీనివలన వైరము వృద్ధియగును. ఇతరుల భోగవిషయ ప్రస్తావన వినగూడదు. దీనివలన లోభ మభివృద్ధియగును.

శ్రోత్రము ; కర్తవ్యము:—

వ్యవహారమునకు నడవడికకు సంబంధించిన మంచి మాటలను, భగవన్నామ గుణలీలలకు సంబంధించిన కథలను, సత్సాంగత్యమందు భక్తి, జ్ఞాన, వైరాగ్య, నీతి, సదాచార, సద్వ్యవహారములకు సంబంధించిన మాటలను, తనదోషములను, తాను అనుకరించ వలసిన ఇతరుల గుణములను, భగవద్భక్తి, త్యాగము, శౌర్యము, దేశభక్తి వీనికి సంబంధించిన సుందరగీతములను, సద్గురువువలన పరమాత్మయందలి నిగూఢతత్త్వమును, వేదాంత వాక్యములను వినవలయును. భక్తికి ప్రథమసాధన మగునది శ్రవణమే యని ప్రతిసాధకుడు జ్ఞాపకముంచు కొనవలయును.

త్వగింద్రియము; ఆవశ్యకత:—

శీతోష్ణ పదార్థములను, కోమల కఠిన పదార్థములను త్వగింద్రియమే గుర్తించును. ఈ యింద్రియము లేనియెడల పదార్థ జ్ఞానాభావము కలుగును. ఇందువలన మనుష్యుడు నిప్పు, నీరు, ముళ్లు, పురుగులు, దోమలు, మొదలగు వాటివలన కలుగుబాధ తెలియజాలడు. త్వగింద్రియము లేనియెడల ప్రపంచమం దేపనియు జరుగనేరదు.

త్వగింద్రియము; నష్టము:—

పరస్త్రీని పురుషుడు—పరపురుషుని స్త్రీయు, స్పృశించరాదు. ఇందువలన కామోద్దీపన మగును. వ్యభిచారము వృద్ధి చెందును. మృదువగు ఆసనములు, పరుపులు, దిండ్లు, తివాచీలు సాధ్యమయినంతవరకు సేవించకూడదు. ఇందువలన భోగపరాయణత, ఆసక్తియు హెచ్చగును. నిర్వ్యాపారత్వ మధికమగును.—

త్వగింద్రియము; కర్తవ్యము:—

శీతోష్ణములవలన, రాళ్ళవలన సాధ్యమైనంతవరకు రక్షణ చెందుట; కర్తవ్యమును దృష్టియందుంచుకొని, పురుషుడు తనధర్మపత్నితోను, స్త్రీ తనభర్తతోను కాలానుసారముగ యథాయోగ్యముగ సాంగత్య సుఖ మనుభవించుట; భగవంతుని విగ్రహము, సత్పురుషులయొక్కయు, తల్లిదండ్రులయొక్కయు, గురువులయొక్కయు చరణస్పర్శ చేయుట; గంగాజలమును స్పృశించుట.

చక్షురింద్రియము: ఆవశ్యకత:—

"సర్వేంద్రియాణాం నయనం ప్రధానమ్"

కన్నులేని యెడల జీవిత మంధకారము. నడకలో ననేక కష్టములు సంభవించును. ప్రాపంచిక వ్యవహార మేదియు జరుగదు. సత్పురుషులయొక్కయు, భగవద్విగ్రహములయొక్కయు దర్శనములు కావు. ప్రకృతి యందలి సౌందర్యమును జూచు భాగ్య ముండదు. శాస్త్రములయొక్కయు, సద్గ్రంథములయొక్కయు దర్శన మభావ మగును. ప్రతి

వ్యక్తియు కన్నులులేని వానిహృదయపరితాపమును హృదయ పూర్వకముగ విచారించిన చెప్పుట కలవికాని దుఃఖము కలుగును.

చక్షురింద్రియము ; నష్టము:—

స్త్రీలు పురుషులయొక్కయు, పురుషులుస్త్రీలయొక్కయురూపములను చెడుదృష్టితో చూడరాదు. దీనివలన కామమభివృద్ధి చెందును. బ్రహ్మచర్యము నశించును. చెడునాటకములు, సినీమాలు, ఆటలు, తమాషాలు, నాట్యములు చూడరాదు. వీనివలన క్రమముగ సంపద సన్నగిల్లును. మనస్సు చెడుభావముల కాకరమగును. దుస్సహవాసమునకు దారి తీయును. మనస్సు నాకర్షించు పదార్థములను, సంఘటనలను, చెడుచేష్టలను చూడరాదు. మహామునియగు సౌభరి మీనముల కామక్రీడ చూచియె పునస్సంసారప్రవిష్టుడాయెను. అజామీళుడు కామ ప్రసంగమును జూచియె మహాపాపాత్ముడాయెను. నేత్రముల నాకర్షించు వస్తువులను చూడరాదు. ఇందువలన మనమున కోరికలు పుట్టును. లోభము వృద్ధి చెందును. అసహనము, దుఃఖము కలుగును.

చక్షురింద్రియము; కర్తవ్యము:—

భక్తుల యొక్కయు, సత్పురుషులయొక్కయు, దర్శనమొనర్చుట, భగల్లీలలను, సచ్ఛాస్త్రములను, సత్స్నానములను, భక్తి, ప్రేమ, వైరాగ్య, శౌర్యములను కలుగజేయు దృశ్యములను చూచుట, మార్గమును చూచుకొని నడచుట, యోగ్యముగ వ్యవహరించుట, మొదలగు వానికి చక్షురింద్రియ మవసరము.

రసనేంద్రియము; అవశ్యకత:—

రసనేంద్రియమువలన రుచి తెలియును. ఇది లేనియెడల ఖాద్య పదార్థముల రుచి తెలియదు. ఇది రుచి గ్రహణార్థము నియమింప బడినది. మనుజుడు కేవల మొకే రుచికి లోనైన వ్యాధిగ్రస్తు డగును.

వాగింద్రియము; అవశ్యకత:—

మానవున కన్నింటికంటె ప్రధాన సాధనము వాక్కు. వాక్కువలననే మనుజుని జాడ తెలియును. తఱచు వాక్కువలననే మానవుడు గొప్పవాడుగా, నీచుడుగా, గుణవంతుడుగా, దుర్గుణుడుగా, సాధువుగా, దుష్టుడుగా, మంచివాడుగా, చెడ్డ వాడుగా, తెలియనగును. వాక్కుకు ప్రధానసాధనము నాలుక. ఇందువలన మనుజునకు రసనేంద్రియ మత్యంతావశ్యకము.

రసనేంద్రియము; నష్టము:—

పులుపు, తీపి, కారము మొదలగు పదార్థముల స్వాద లాలసకు చిక్కుకొన రాదు. ఇందువలన జిహ్వా చాపల్యము వృద్ధియగును. జిహ్వాచాపల్యము కలవాడు దుర్గతి చెందును. చాలమంది యిందువలననే ధర్మభ్రష్టులై దుఃఖితు లగుచు న్నారు. ఈ యింద్రియమునకు వశవర్తి యగుటవలన నెచ్చ టైనను, ఏ విధమైనదైనను, ఆహారమును ధర్మమును ఆరోగ్య మును మరచి గ్రహించుచున్నాడు. రోగు లింద్రియాసక్త చిత్తులగుటచే వైద్యుని యాజ్ఞకు విరుద్ధముగ ప్రవర్తించి మృత్యువువాత బడుదురు. జిహ్వా చాపల్యమువలన దొంగతన మలవడును.

మద్యము, మాంసము, అపవిత్ర పదార్థములు తినరాదు. ఇందువలన ధర్మము, ధనము, ఆరోగ్యము, బుద్ధియు నశించును. దొంగ తనమొనర్చియు, అన్యాయ మొనర్చియు సంపాదించిన అపవిత్రాన్నమును తినరాదు. ఇందువలన బుద్ధి చెడును. తమో గుణాత్మక మగు బుద్ధివలన తమో గుణ రూపమగు కార్యము లేజరుగును. ఇందువలన మనుజుడు పతితుడగును.

వాగింద్రియము; నష్టము:—

కటువుగా మాట్లాడరాదు. ఇందువలన యితరుల మనస్సు నొచ్చుకొనును. వైరము వృద్ధిచెందును. ఎవనిని నిందించరాదు. చాడీలు చెప్పరాదు. ఇట్లు చేసిన యితరుల పాపములు తనకు సంక్రమించును. ఘృణ, ద్వేషము, వైరము, క్రోధము, హింస మొదలగు దోషము లుత్పన్నములగును.

తనను తా ప్రశంసించు కొనరాదు. ఇందువలన పుణ్యము నశించుట, ముఖస్తుతులను వినుటకు యిష్టతయు జనించును. తా నొనర్చిన దాన ధర్మములు, పరోపకారములు ప్రకటించరాదు. ఇందువలన పుణ్యము నశించును. యయాతి మహారాజు తన దానపుణ్య ప్రశస్తిని స్వయముగ ప్రశంసించుటవలన స్వర్గమునుండి పతితుడాయెను. ఎవనిని ముఖస్తుతి చేయరాదు. దీనివలన అబద్ధమాడుటయు, ముఖస్తుతిచేయు అలవాటుకు లోనగుటయు సంభవించును. తేజస్సునశించును. ఇతరుల చర్చకాని, అనవసరపు మాటలుకాని మాట్లాడరాదు. ఇందువలన కాలము వ్యర్థమగును, అసత్యము వెలువడును.

వ్యర్థముగ స్తుతినిందలు జరుగును. అనవసరపు సంస్కారములు మనమున ప్రవేశించును. ఇతరులదోషములు చూచుట యలవడును. అసత్యము మాట్లాడరాదు. ఇందుచే నన్నిధర్మములు నశించును. విశ్వాసము, వాక్కుయందలి సామర్థ్యము నశించును. ఎవరిని దెప్పకూడదు. ఆక్షేపించ రాదు. ఎవనిని వాని యంగ వైకల్యముచే గాని, కర్మ హీనత్వముచే గాని సంబోధించ రాదు. (అనగా చెవిటివాడవు; కుంటివాడవు గ్రుడ్డి వాడవు; కుష్టిరోగివి; పాపాత్ముడవు; మొదలగు వాక్యములచే) దానివలన వినువాని మనస్సు మిక్కిలి దుఃఖించును. తన్మూలమున హింసయేర్పడును. ఇది మహాపాపము. చెడు మాటలు, అసభ్యపు మాటలు మాట్లాడరాదు. శృంగార గీతములు పాడరాదు. కామము వృద్ధిపరచు మాటలు పలుకరాదు. ఇందువలన వీర్యము నశించి యధః పతితు డగును. ఎవనిని తన కొరకేపదార్థమును కోరరాదు. ఈ కారణమువలన తేజము నశించును. ప్రజాదృష్టిలో పతితు డగును. గౌరవము నశించును. దైవము, గురువులు, తల్లిదండ్రులు, సత్పురుషులు, పెద్దలు, శాస్త్రములు వీరినిగూర్చి దోషయుక్తముగ మాట్లాడరాదు. ఇందుచే నశ్రద్ధ అవిశ్వాసము, ధాష్ట్ర్యము, ఉచ్ఛృంఖలత; అభివృద్ధి యగును.

రసనేంద్రియము; కర్తవ్యము:—

వస్తువుల గుణదోషముల జూచి ధర్మమునకు స్వాస్థ్యమున కనుకూల మైనట్టియు, ఆయు రారోగ్యబలసత్వముల కలుగజేయు నట్టియు, సుఖప్రీతి వర్ధకమైనట్టియు, బుద్ధిని సాత్త్వికమొనర్చునట్టియు, పదార్థములను సేవించవలెను.

ప్రతివస్తువు భగవదర్పితము చేసి సేవించ వలయును. భగవంతుని చరణామృతమును పాన మొనర్ప వలయును.

వాగింద్రియము; కర్తవ్యము:—

సత్యము, మధురము, హితకారియు నగు నట్టియు, ఉద్వేగమును కలుగజేయు నట్టియు, ప్రియముగ నుండు మాటలను వినయపూర్వకముగ మాట్లాడవలయును. భగవన్నామమును జపించుచు ఆతని గుణములను గాన మొనర్ప వలయును. ఇతరుల మనస్సు ప్రసన్న మొనర్చునట్టియు, సుఖదాయక మగు నట్టియు, ఐహిక, పారలౌకిక కళ్యాణము చేకూర్చు నట్టియు, మాటలనే పలుక వలయును.

ఘ్రాణేంద్రియము; అవశ్యకత:—

నాసిక గంధమును గ్రహించును. ఇది లేనియెడల మానవుడు మురికి పదార్థముల యందలి చెడుగంధమును గ్రహించి రోగగ్రస్తుడగును. దేవతలకును, మహాత్ములకు మురికి పదార్థములనునివేదించి వారియవమానమునకు కారణ భూతు డగును. ఇట్టివి లేకుండుటకే నాసిక యవసరము.

ఘ్రాణేంద్రియము; నష్టము:—

పరిమళ ద్రవ్యములందు, తైలములందును ఆసక్త చిత్తుడు కాకూడదు. ఇందువలన విలాసత్వము వృద్ధిచెందును. చెడు వృత్తులకు లోనగును. ధనము, ధర్మము, నశించును. ఈ ద్రవ్యములు చూచి యితరులకు. కూడ కోరికలు కూడ జనించును. ధనాభావమున దొంగతన మొనర్తురు, విలాసము కొరకు పై వస్తువు లుపయోగించు వారు స్వయముగ పతితు

లగుటయే కాక, ఇతరులనుగూడ పతితుల నొనర్తురు. అన సవరమగు పరిమిళ సుమములను, మాలలను ధరించరాదు. ఇందువలన ఆసక్తి వృద్ధి చెందును.

ఘ్రాణేంద్రియము, కర్తవ్యము:—

ఆరోగ్యముకొఱకై దుర్వాసనాయుత పదార్థములను విడువవలయును. భగవంతున కర్పించిన పుష్ప, ధూప, దీపాదుల సుగంధ ద్రవ్యములను, యజ్ఞ సంబంధ సుగంధమును ఆఘ్రాణించ వలయును. భగవత్ప్రసాదముయొక్క గంధము నాఘ్రాణించ వలయును.

ఈవిధముగ నాలోచించి యింద్రియములను విషయములందు ప్రవేశపెట్టి, విషయాసక్తుడు కాక, వానిని సదుపయోగ మొనర్చుచు యోగ్యముగ వ్యవహరించ వలెను. ఇంద్రియము లున్నంతవరకు వానిని విషయములనుండి వేరు పరుపజాలము. కాబట్టి ఆత్మను పతన మొనర్చునట్టియు నిందితములు నగు విషయములందు ప్రవర్తిల్ల నీయక వానిని సద్విషయములందు ప్రవర్తింప జేయువలెను. దీనినే ఇంద్రియ నిగ్రహమందురు. ఇంద్రియము లగ్నిహోత్రము వంటివి. అగ్నివలన ఆహారము పచనమగును. శీతలబాధ నివారణ యగును. కాని దానిని దురుపయోగ మొనర్చిన చేతులు కాళ్ళు కాలును. గ్రామములు కూడ దగ్ధమగును. ఇట్లె యింద్రియములను సదుపయోగ మొనర్చిన మంచిలాభమును పొందును. చెడుగ ప్రవర్తింపజేసిన తాను పతితుడగుటయే కాక యితరులను గూడ పతితులను జేయును. ఇందువలన మనుజు డింద్రియము

లకు వశవర్తి కాక, తనవశ మందుంచు కొనవలెను. వశవర్తినులై ఇంద్రియములు ద్వారా యథోచితముగ వ్యవహరించిన మనస్సు పరిశుద్ధత నొందును.

"రాగద్వేష వియుక్తైషు, విషయానింద్రియై శ్చరన్
ఆత్మ వశ్యై ర్విధేయాత్మా ప్రసాద మధిగచ్ఛతి
గీత-2-64

మనస్సును స్వాధీన పరచుకొనిన పురుషుడు రాగద్వేష రహితుడై తనవశమందున్న ఇంద్రియములద్వారా విషయ ప్రవృత్తుడై మనఃప్రసాదము నొందును.

కాని యింద్రియములు మిక్కిలి బలవత్తరమైనవి. ఈ కారణమువలననే శ్రీకృష్ణుడు.

"యతతో హ్యపి కౌంతేయ, పురుషస్య విపశ్చితః
ఇంద్రియాణి ప్రమాథీని హరంతి ప్రసభం మనః"
గీత-2-60

ఓ అర్జునా? సాధన చేయు బుద్ధిమంతుడగు పురుషుని మనస్సునుగూడ ఇంద్రియములు బలాత్కారముగ విషయ ప్రవిష్ట మొనర్చును.

"ఇంద్రియాణాం తు సర్వేషాం యద్యేకం క్షరతాం యది
తేనాస్య క్షరతి ప్రజ్ఞా దృతేః పాదాదివోదకమ్"
మనుస్మృతి

నీటితో నిండిన ఘటమున నొక రంధ్రము పడినంతనే నీరెట్లు బహిర్గతమగునో, అట్లే యింద్రియము లన్నిటిలో నొక యింద్రియమైనా విషయాసక్తమైనయెడల బుద్ధి పతన మగును.

ఇందుచే నింద్రియములను విషయ వాసనల యందు కష్టసుఖములను, గుణ దోషములను, పరిశీలించి విషయ వాసనలయందు ప్రవర్తిల్ల నీయక ఉత్తమములు, ఆవశ్యకములు, మంగళములు నగు కర్తవ్య కార్యములయందు ప్రవర్తింప జేయుట ఉత్తమ సాధకుని లక్షణము. దీనినే ఇంద్రియనిగ్రహ మందురు.

మఱియు శ్రీకృష్ణు డిట్లుచెప్పెను.

"వశేహి యస్యేంద్రియాణి తస్య ప్రజ్ఞా ప్రతిష్ఠితా"
గీత

ఇంద్రియములను వశమందుంచుకొనిన పురుషుని బుద్ధి స్థిరముగ నుండును, కాని బలవంతముగ నింద్రియములను విషయ ప్రవృత్తినుండి మరలించిన వశమందుండ జాలవు.

"న తథైతాని శక్యంతే సంనియంతు మసేవయా
విషయేషు ప్రజుష్టాని యథా జ్ఞానేన నిత్యశః"
మనుస్మృతి

విషయాసక్తములగు ఇంద్రియములు "విషయములు, శరీరము, నశ్వరమైనవి" అను వివేకమువలన వశమైనట్లు, కేవల విషయ పరిత్యాగమువలన వశము కానేరవు.

ఇంద్రియ నిగ్రహము; ఉపాయములు:—

(1) లౌకిక భోగములు క్షణభంగురము లని యెల్లప్పుడు విమర్శ చేయుచుండుట.

(2) ఐహిక సుఖములందలి దోషములను, దుఃఖములను విమర్శనాదృష్టితో చూచుచుండుట.

(3) భగవంతుని నిత్యత్వమును, సత్యత్వమును మనసునందు ధ్రువ పరచుకొనుట.

(4) భగవత్ప్రాప్తియందుండు పరమసౌఖ్యమునుఎల్లప్పుడూహించు చుండుట.

(5) భగవన్నామమును జపించుట.

(6) ఎల్లప్పుడు సత్కార్యములందు నిమగ్నుడై యుండుట, ఏకాంత స్థలమందు నిర్వ్యాపారుడై యుండకుండుట, సత్సాంగత్యము, సచ్ఛాస్త్రాధ్యయనము చేయుట.

(7) సాత్వికాహారమును భుజించుట.

(8) ఏ యింద్రియమైనా విషయ ప్రవృత్తమగు నపుడు వెంటనె తాను కూడ విషయప్రవిష్టుడు కాక, దాని పరిణామము నాలోచించుట.

(9) వ్యాయామ మొనర్చుచు, యోగమునకు సంబంధించిన ఆసనము లభ్యసించు చుండుట.

(10) భగవంతుని యెల్లవేళల స్తుతించుట.

ఈసాధనములు ఇంద్రియ నిగ్రహమునకు చాల సహాయమగును. కొలది కాలములో వాడు జితేంద్రియుడగును.

జితేంద్రియుని లక్షణము :

"శృత్వా స్పృష్ట్వాచ దృష్ట్వాచ భుక్త్వా ఘ్రాత్వా చయో నరః
నహృష్యతి గ్లాయతి వా స విజ్ఞేయో జితేంద్రియః"

మనుస్మృతి 2.98

స్త్రీల మృదుమధుర గీతములను, తన ప్రశంసను, తన నిందను, కఠిన వాక్కులను, వినినను. కోమలావయవములను, పుష్పములను, మెత్తని దుస్తులను, ఆసనములను, కఠిన పదార్థ ములను స్పృశించియు, స్త్రీలను, సుందర దృశ్యములను, ఉద్యాన వనములను, దుఃఖదాయకములగు దృశ్యములను చూచియు, మధుర పదార్థములను, అపక్వము, అనిష్టములు నగు పదార్థములను భుజించియు, సుగంధములను గాని, దుర్గంధ ములను గాని వాసనచూచియు సుఖదుఃఖములు సమముగ ననుభవించు వాడు జితేంద్రియుడు.

కాగా ప్రాజ్ఞుడు పూర్వోక్తములగు ఇంద్రియ నిగ్రహ ములను చక్కగ శ్రద్ధాభక్తులతో నలవరచుకొని ఈశ్వరా నుగ్రహమునకు పాత్రుడగుగాక.

# బుద్ధి

మానవ ధర్మములలో నేడవది బుద్ధి. బుద్ధి మిక్కిలి యద్భుతమైనది మానవు డున్నతి పొందుటకు, అధః పతితు డగుటకును బుద్ధియే కారణము.

"ఆత్మానం రథినం విద్ధి శరీరం రథ మేవ తు
బుద్ధిం తు సారథిం విద్ధి మనః ప్రగ్రహ మేవచ
ఇంద్రియాణి హయా నాహుర్విషయాం స్తేషు గోచరాన్
ఆత్మేంద్రియ మనోయుక్తం భోక్తే త్యాహు ర్మనీషిణః.

కఠోపనిషత్తు 1-3-3-6.

శరీరము రథము. రథమున కూర్చుండునది ఆత్మ. బుద్ధి సారథి, మనస్సు కళ్లెములు. ఇంద్రియములు గుఱ్ఱములు. శబ్దస్పర్శాదులు మైదానము. శరీరేంద్రియములతో కూడిన మనస్సు అనుభవించునది.

రథము గుఱ్ఱములు లేకుండగ నడువజాలదు. సరియగు మార్గమున దానిని నడుపవలయును. కళ్ళెములు ధరించువాడు

బుద్ధిమంతుడై జాగరూకత కలిగి యుండవలయును. సారథి ప్రధానముగ నాలుగు గుణములు కలిగి యుండును. రథమందున్నవాని ఆజ్ఞను పాలించుట, వెళ్ళవలసిన స్థానము తెలిసియుండుట, మార్గము బాగుగ తెలిసియుండుట, మార్గానుకూలముగ కళ్లెముల బిగించుచు వదల్చుచు నడుపుట యీనాల్గు గుణములు కలిగి యుండవలయును. ఈనాల్గు గుణములలోనే యొకటి లోపించినను రథము భ్రష్టమై పతితమగును. ఇంద్రియరూపమగు బలవంతములైన గుఱ్ఱములు విషయరూపమగు మైదానమునకు పరుగిడుటకు నిరీక్షించుచుండును. బుద్ధి విశారదమగు బుద్ధిరూప సారథి, మనోరూపమగు కళ్లెములను జాగరూకతతో తన వశమందుంచుకొనవలయును. ఇంద్రియ రూపమగు గుఱ్ఱముల వేగము చెప్పుటకు వీలుకాదు. అవి కళ్ళెములు లేకయు పరుగిడును.

మనస్సు చెడ్డది. మనస్సు అన్యథా సక్తమైనపుడు, సన్నిధానమున జరుగు విషయమైనను గ్రహించు శక్తి ఇంద్రియముల కుండదు. కన్ను చెవి మొదలగు నవి మనస్సు ఆసక్తమైన వైపుకే నిరీక్షించి యుండును. కాగా మనస్సు యెటు నిమగ్నమైన, ఇంద్రియరూపమగు గుఱ్ఱములుగూడ నటువైపు నడచును. సారథి వివేకరహితుడు, కర్తవ్య నిర్ణయాసమర్థుడు, దుర్బలుడు అగుచో, ఇంద్రియ రూపములగు దుష్టగుఱ్ఱములు సారథివశమున లేకుండగ, కళ్ళెముల ప్రతిబంధకము లేని కారణమున, తమ యిష్టమువచ్చినట్లు నడచును. అట్లు నడచుట వలన సారథిసహితముగ దుష్టస్థానమున పడి యంతయు పతితమగును.

మనము గృహములోపల కూర్చుని యుందము. బయట మార్గమున ఒకధ్వనికలుగును. ధ్వనియందు కర్ణేంద్రియము లగ్నమగును. కాని వివరము చెప్పుటకు కర్ణేంద్రియమునకు సామర్థ్యము లేదు. వెంటనె యీవిషయమును చెవి మనస్సుతో చెప్పును. మనస్సు దీనిని గూర్చి బాగుగ విమర్శించును. మనస్సు సవికల్ప నిర్వికల్పములూ కలది. కాబట్టి మనస్సు నిర్ణయించలేదు మనస్సు యీవిషయమును బుద్ధితో చెప్పును. బుద్ధి విచారించి నిర్ణయించును. "ఈధ్వని మార్గమున నడచు స్త్రీయొక్క కాలి యాభరణ సంబంధము" అని ఇట్లు విషయ నిర్ణయముకాగానే మనస్సు చూచుట కువ్విళ్లూరును. ఇట్టి సమయమున బుద్ధి ధర్మమందుండి, పరమాత్మయందు నిశ్చయాత్మ కలదియైన వెంటనె మనస్సును వెనుకకు లాగి "నీకు తగదని" బుద్ధిచెప్పును. బుద్ధి యిట్టిది కానిచో మనస్సుతో నైక్యమగును. బుద్ధి చలించిన మనస్సు ఇంద్రియములకు వశమగును. వెంటనే ఇంద్రియములు పరుగిడును. కన్ను చూచును చెవి వినును. ఇట్లె క్రమముగ మిగిలిన యింద్రియములన్నియు తమతమ వ్యాపారములలో నిమగ్నములగును. కాగా బుద్ధి యేమాత్రము జాగరూకతతో లేకున్నను మహాపాప మనుభవించ వలసివచ్చును. ఈ విషయము వ్రాయుట చాలకష్టతరము. చెప్పుట చేయుట క్షణకాలము. మనస్సు, బుద్ధి, ఇంద్రియములు చేయుపని మిక్కిలి శీఘ్రముగ జరుగుచుండును. చెవిలో ధ్వనిపడగానే మనస్సు ఆలోచించును. బుద్ధితో చర్చించును మనస్సులో కోరిక పుట్టును. వెంటనే ఇంద్రియ

ములద్వారా అనుభవించును. కాన సర్వవిధముల బుద్ధి జాగ్రత కలిగి యుండవలయును.

బుద్ధిరూపమగు సారథి కళ్లెములను అజాగ్రత్తగా పట్టుకొనిన, ఇంద్రియరూపమగు గుఱ్ఱములు స్వేచ్ఛా సంచారమొనర్చును. ఇంద్రియములు వశమందున్న చక్కని మార్గమున నడచును. సర్వ విధముల శరీర రూపమగు రథమున కూర్చొని, ప్రధానలక్ష్యమగు పరమాత్మ యొక్క పరమ ధామము పొందుటకు బుద్ధిరూపమగు సారథి పరమేశ్వరుని యందు నిశ్చయ బుద్ధికలిగి, ఇంద్రియ రూపములగు గుఱ్ఱముల కళ్ళెములను సత్వగుణ సంపన్నములగు విషయ రాజమార్గముల యందు నడుప వలయును. ఎంతవరకు మార్గము బాగుండునో అంతవరకు రథము పోవును. శరీరరథమునగల ఆత్మ లక్ష్యస్థానము చేరువరకు మరియొక మార్గము లేదు. మార్గమున నడచునపుడు జాగరూకత కలిగి యుండవలయును. మంచి మార్గమున నడచిన రథము లక్ష్యస్థానము చేరును. దుష్టమార్గమున నడచిన, పదేపదే దుఃఖముల ననుభవించును గమ్యస్థానము చేరుటయు దుర్లభము. ఇందెంత మాత్రము సందియములేదు. శరీరము, ఇంద్రియములు, మనస్సు, బుద్ధి పరమ ధామము చేరలేవు. వీటి సహాయమువలననే గమ్యస్థానము చేరవలయును.

"ఇంద్రియాణి పరాణ్యాహు రింద్రియేభ్యః పరం మనః
మనసస్తు పరాబుద్ధి, ర్యోబుద్ధేః పరతస్తు సః"

గీత 3-42

శరీరముకంటె ఇంద్రియములు శ్రేష్ఠములు. బలము గలవి. సూక్ష్మములు. ఇంద్రియములకన్న మనస్సు, మనస్సు కన్న బుద్ధి, బుద్ధికన్న పరమాత్మ మిక్కిలి గొప్పవి.

మార్గము చివరవరకు రథము వెళ్లగలదు. అనగా దివ్య భవనము వెలుపలవరకు వెళ్లగలదు. భవన ప్రాకార ద్వారము వద్ద గుఱ్ఱములు (ఇంద్రియములు) ఆగును. అక్కడ వృక్ష ఛాయయందు గుఱ్ఱములు బంధింపబడును. కళ్లెములు(మనస్సు) జీను చర్మవికారమగుటయు, సారధి (బుద్ధి) వృషలు డగుటవల నను ప్రాకార ద్వారమువరకు మాత్రమె ప్రవేశము కలుగును. సారధికి లోన ప్రవేశించుట కధికారము లేదు. రథముమీాద వచ్చిన ఆత్మ దివ్యభవనమున ప్రవేశించును. లోన ప్రవేశిం చిన ఆత్మ యెప్పటికి బయటకు రాదు. సారధి చిరకాలముండి పిలచి సమాధానము రామి చేనిరాశ కలిగి నిరాశుడై బయటనుండి దివ్యభవనమును చూచి, మరలిగుఱ్ఱములకుకళ్లెములు, జీనుతగిల్చి రథముపూన్చి,ఆత్మహీనమగు (రథముమీాద నెవరు లేకుండగనె) రథమును తోలుకొనివచ్చినమార్గమునబయలుజేరును. "యతో వాచో నివర్తంతే, అప్రాప్య మనసా సహ" కొంత దూరము వచ్చి, ఆ దివ్యభవన సౌందర్యమును వర్ణించును. కాని దివ్య భవనములోగల బ్రహ్మపదార్థమును మాత్రము వర్ణించలేదు. ప్రాకార ద్వారమువరకుగల విషయములు మాత్రమె తెలి యునుగాని, లోపల రహస్యములు తెలియుటెట్లు? కాగా పర బ్రహ్మయొక్క దివ్యభవన ప్రాకారద్వారమువరకె బుద్ధి వెళ్ళ గలిగినది. అందువలన భవనములోని రహస్యములు తెలియవు. ఇది పరబ్రహ్మ స్వరూపము. ఈరీతిగా వెళ్ళునది ముక్తపురు

షుల బుద్ధియె. ఇతరుల బుద్ధి కిట్టియోగ్యత లేదు. కాని యధార్థ ప్రవృత్తితో లక్ష్యమార్గము నిర్ణయించి, బ్రహ్మ పదార్థమును సూక్ష్మ దర్శములగు సూక్ష్మవస్తువులద్వారా నిరీక్షించుటకు నిత్యము ప్రయత్నించుచు, ఏకాగ్రత కలిగి వర్తించు వారి శుద్ధబుద్ధికూడ పూర్వోక్త దివ్యభవన మందలి రహస్యమును తెలిసికొని అందు ప్రవేశించకలదు.

"దృశ్యతే త్వగ్ర్యయా బుద్ధ్యా
సూక్ష్మయా సూక్ష్మదర్శిభిః"

కఠ-1-3-12

బుద్ధి ఆత్మ సాక్షాత్కారమునకు ప్రధాన సాధనము. సాత్త్వికబుద్ధి, రాజసబుద్ధి, తామసబుద్ధి అని బుద్ధి మూడు విధములు. భగవత్ప్రాప్తి సాధనములయందు సంలగ్నమైనది సాత్వికబుద్ధి.

"ప్రవృత్తిం చ నివృత్తిం చ
కార్యా కార్యే భయాభయే
బంధం మోక్షం చ యా వేత్తి
బుద్ధిః సా పార్థ సాత్త్వికీ"

గీత-18-30

అర్జునా! ప్రవృత్తి నివృత్తులయొక్కయు, కర్తవ్యా కర్తవ్యములయొక్కయు, భయాభయములయొక్కయు, బంధ మోక్షములయొక్కయు, భేదము దేనిచే తెలిసికొబడునో, అది సాత్త్విక బుద్ధి.

బుద్ధిరూపమగు సారధి ద్వారా, శరీరరధము చలించు చుండును. సాత్విక బుద్ధి కల్యాణాత్మక మగు మార్గమున నిశ్చ

యాత్మ కలది. అజ్ఞానియొక్క బుద్ధి యనేక విధములగు భేదాభిప్రాయములతో ననంత విధములుగ ప్రవర్తించును.

రాజస పురుషుని బుద్ధి రాజసము. తామస పురుషుని బుద్ధి తామసము.

"యయా ధర్మ మధర్మం చ
కార్యంచా కార్యమేవ చ
అయథావ త్ప్రజానాతి,
బుద్ధిః సా పార్థ రాజసీ"

గీత 18-31

అర్జునా! మనుష్యు డేబుద్ధివలన ధర్మా ధర్మముల యొక్కయు, కర్తవ్యా కర్తవ్యముల యొక్కయు, యథార్థమును తెలిసికొనజాలడో, అట్టివాని బుద్ధి రాజసము.

"అధర్మం ధర్మమితి యా
మన్యతే తమసా వృతా
సర్వార్థా న్విపరీతాం శ్చ
బుద్ధిః సా పార్థ తామసీ"

గీత 18-32

అర్జునా! ధర్మమును అధర్మముగాను, సమస్త సదర్థములను విపరీతార్థములుగా తలచువాని బుద్ధి తామసము.

మనువు కేవలసాత్త్విక బుద్ధివిచారమే చేసినాడు. సత్త్వ బుద్ధివలన సచ్ఛాస్త్రానుసరణము, ఆత్మవిచారము, భగవద్భజనము కలుగును. తన్మూలమున పరమ కల్యాణస్వరూపాత్మకమగు పరమాత్మ ప్రాప్తి సిద్ధించును.

# విద్య

మానవ ధర్మములలో నెనిమిదవది విద్య. విద్య యన నాధ్యాత్మిక విద్య. భగవంతు డధ్యాత్మవిద్యను తనస్వరూప ముగా చెప్పెను.

"అధ్యాత్మ విద్యా విద్యానాం"

గీత 10-32

ఈ యధ్యాత్మ విద్యవలన పరమాత్మప్రాప్తి లభించును. ఐహిక సంబధౌన్నత్యమును గాని, ఐశ్వర్య గౌరవాదులనుగాని అభివృద్ధి బొందించు విద్య విద్యకాదు. భగవత్ప్రాప్తికి సాధన సహాయకములు కానిది విద్యగా పరిగణింప బడదు.

ప్రాచీనభారతీయవిద్యకు కుఠారాఘాతము తగిలినది. కేవల భోగపరాయణత కొరకే విద్యయనియు అట్టి ఫలమును చేకూర్చునదే విద్యయనియు, దానికొరకే విద్యాభ్యాసము, విద్యాలయము లనియు లోక మీనాడు నిశ్చితాభిప్రాయము

కలదైనది. సుఖములకన్నిటికి ప్రధానాధారమగు పరమ సుఖ స్థానమును లోకము తెలిసికొనుటలేదు. తెలిసికొనుటకై యత్నమును లేదు. వ్యర్థకాలక్షేపములు జేయు లోక మధిక మైనది. ప్రతివాడును ఉద్యోగియె. మానవజన్మకు ధనార్జనయె ప్రధాన లక్ష్యమైనది. సుఖము, భోగము, సుకుమారము అధిక మైనవి. విద్యాభిమానము లధికమయి పరమార్థ సాధనకు సహాయులమగుదమని సంఘములు బయలుదేరి, లోకములో సంస్కారములు, తన్మూలమున అన్యాయము లధికములైనవి. పరమేశ్వరుని యందు పరమేశ్వర సాక్షాత్కార సాధనముల యందు, విశ్వాసము దూరమయినది. ఇట్టి విద్యాభ్యాసము వలన తత్కాల సుఖ మపేక్షించినను కాలాంతరమున కష్టము లకు గురికావలసినదె. ఇట్టి విద్య సర్వధా త్యాజ్యము. వర్త మాన కాలమున సర్వవిధముల పతితకారణమున శాంకరమగు విద్యయే విస్తారముగా బోధింప బడుచున్నది. కాని దాని యందలి యథార్థము గ్రహించుటలేదు. వర్తమాన కాల విద్యాప్రబోధ విషయమున; విద్యాధికారుల యొక్కయు, బోధకులయొక్కయు దృష్టి సత్వమార్గమున నడచుటలేదు. విద్యాలయములలో విద్యార్థులకు పరమార్థసాధనకు సాధన భూతమగు విద్యగూడ ప్రారంభదశనుండియు క్రమముగ బోధించు చుండిన, ప్రతివాని జీవితము సార్థకము కాగలదు. పరమార్థ సాధన కుపకరించు విద్యాబోధన లేని విద్య విద్య గాదు. అట్టి విద్యాలయము విద్యాలయమును గాదు.

ధర్మమునందు, సదాచారమునందు భక్తిశ్రద్ధలు కలిగిం చునది విద్య. మఱియు చేతనాచేతనరూపమగు ప్రపంచమంతట

భగవత్స్వరూపమును వ్యక్తపరచునది విద్య. అనేకత్వమున ఏకత్వమును బోధించి, యథార్థ స్వరూపమును తెలియపరచి, పరమ సుఖస్థానమును పొందింప జేయునది విద్య. అట్టివిద్యను నిత్యము మననము జేయుచు భగవదభిముఖ మగునట్లు లోకము ప్రయత్నించ వలెను.

# సత్యము

సత్యమేవ జయతే నానృతమ్.

**మా**నవ ధర్మములలో తొలిమొదవది సత్యము. జగ
త్సంసారమున విభిన్న ధర్మసంప్రదాయములు కలిగి మతభేదము
**లు**న్నను సత్యవిషయమున నన్నిమతములు, ఒకే యభిప్రాయము
కలిగి యున్నవి. శాస్త్రము లన్నియు సత్యమును గూర్చి దివ్య
గాన మొనర్చినవి, "సత్యం జ్ఞాన మనంతం బ్రహ్మ" యను
దానివలన బ్రహ్మస్వరూపము సత్యమె యని నిర్ధారణ యగు
చున్నది.

"సత్యా న్న ప్రమదితవ్యమ్"

తైత్తిరీయము.

నాస్తి సత్యాత్పరో ధర్మో నానృతా త్పాతకం పరం
స్థితిర్హి సత్యం ధర్మస్య తస్మా త్సత్యం నలోపయేత్.
ఉపైతి సత్యా ద్దానం హి తథా యజ్ఞాః సదక్షిణాః
త్రేతాగ్ని హొత్రం వేదాశ్చ యే చాన్యే ధర్మ నిశ్చయాః.

అశ్వమేధ సహస్రంచ, సత్యం చ తులయా ధృతమ్
అశ్వమేధ సహస్రాద్ధి సత్యమేవ విశిష్యతే"

భారతము, శాంతి, అధ్యా-162

సత్యముతో సమానమగు ధర్మము, అసత్యముతో సాటియగు పాపమును లేవు. ధర్మము సత్యముయొక్క యాశ్రమమున గలదు. కాబట్టి లోక మెప్పుడును సత్యమునకు హానికలిగించరాదు. దానము, దక్షిణతోకూడిన యజ్ఞము, అగ్నిపూజనము, వేదాధ్యయనము ఇంకను యితరధర్మముల యొక్కయు ఫలము కేవలము సత్యప్రవచనమువలన సిద్ధించును. వెయ్యి అశ్వమేధములయొక్క ఫల మొకవైపున సత్య మొకవైపున త్రాసునందుంచి తూచిన సత్యముతో సాటి రాదు. సత్యమునుగూర్చి వేదములు, పురాణేతిహాసములు మొదలగు వాటిలోగల యభిప్రాయములు, మహాత్ముల యనుభవములు చెప్పవలయునన కొన్నిగ్రంథ భాండాగారము లగును. సత్యమనగా నేమి? దానిస్వరూప మెట్టిది? దాని నెట్లుప యోగించ వలయును?

సత్యమనగా నేమి ?

వాస్తవముగ సత్యమన పరమాత్మ.

"ఆబ్రహ్మ తృణపర్యన్తం మాయయా కల్పితం జగత్,
సత్యమేకం పరం బ్రహ్మ విదిత్వైవం సుఖీభవేత్."

బ్రహ్మ మొదలు తృణమువఱ కంతయు మాయాకల్పితము. ఒక పరబ్రహ్మమాత్రము సత్యము. దానిని తెలిసికొనినవాడు సుఖవంతుడు. నిత్యము, అవినాశి, ఏకరసము, శుద్ధ

బోధము, చైతన్యము, వీటివికార రహితము నగునదియే సత్యము.

భీష్ముడు ధర్మజునకు, ధర్మోపదేశము చేయుచు నిట్లు నుడివినాడు.

"అవికారి తమం సత్యం సర్వవర్ణేషు భారత
సత్యం సత్సు సదా ధర్మః సత్యం ధర్మః సనాతనః
సత్యమేవ నమస్యేత సత్యంహి పరమాగతిః
సత్యం ధర్మ స్తపో యోగః సత్యం బ్రహ్మ సనాతనం,
సత్యం యజ్ఞః పరః ప్రోక్తః సర్వం సత్యే ప్రతిష్ఠితమ్"

భారతము శాంతి-అ-162

సత్యము సర్వవర్ణములయం దెల్లపుడు వికార రహితముగ నుండును. సత్పురుషులయందు సత్యము సర్వకాలములందు నివసించి యుండును. సత్యము సర్వస్వరూపము. సత్యమీశ్వర రూపము. సత్యమే పరమగతి. సర్వోత్కృష్ట మగు పరమ సత్యమునకు నమస్కారము. ధర్మము, తపస్సు, యోగము యజ్ఞము, సనాతన బ్రహ్మ స్వరూపము సత్యమె, సర్వము సత్యమందె ప్రతిష్ఠితము.

"ఆచారా నిహ సత్యస్య యథా పదను పూర్వశః
లక్షణంచ ప్రవక్ష్యామి, సత్యస్యేహ యథా క్రమం"
ప్రాప్యతే చ తథా సత్యం తచ్ఛ్రోతు మిహార్హసి,
సత్యం త్రయోదశ విధం సర్వలోకేషు భారత!
సత్యంచ సమతాచైవ దమశ్చైవ నసంశయః
అమాత్సర్యం క్షమాచైవ హ్రీ స్తితిక్షా నసూయతా.

త్యాగో ధ్యాన మథా ర్యత్వం ధృతిశ్చ సతతం దయా
అహింసా చైవ రాజేంద్ర! సత్యాకారా స్త్రయోదశ
సత్యం నామావ్యయం నిత్య మవికారి తథైవచ
సర్వధర్మా విరుద్ధేన యోగేనైత దవాప్యతే''
భారతము శాంతి-162. 6-10 శ్లో

హే ధర్మనందనా ? సత్యముయొక్క యాథార్థ్యము, లక్షణము క్రమముగ వినిపించెదను. సత్యము పదుమూడు విధములుగ చెప్పబడుచున్నది. సత్య రూపాత్మకమగు ఈశ్వర ప్రాప్తి కీపదుమూడు లక్షణములు మిక్కిలి యుపయోగ కరములు. సమత, దమము, మాత్సర్యరాహిత్యము, క్షమ, లజ్జ, తితిక్ష. అసూయా రాహిత్యము, త్యాగము, ధ్యానము, సాధుత్వము, ధైర్యము, దయ, అహింస యివి సత్యముయొక్క ప్రధాన లక్షణములు. పై ధర్మము లాచరించిన, మానవు డనుకూలముగ సునాయాసముగ సత్యమును పొందగలడు.

బ్రహ్మ పదార్థమొక్కటె సత్యము. దానిని పొందుటకు జేయుసాధనయె సత్యముగా జెప్పబడు చున్నది. పూర్వోక్త సాధనముల సముదాయముగూడ సత్యమె. పై లక్షణములను వివరముగా నిచట జెప్ప నవసరములేదు. పూర్వోక్తములగు మానవ ధర్మములలో చాలవరకు వాని స్వరూప నిర్వచనము జేయబడినది. అన్నిటికి ముఖ్యమగు వాక్కుతో సంబంధమైన సత్యము యిచట వివరముగ జెప్పబడు చున్నది. సామాన్యముగ మానవుడు, చెవి, కన్ను మొదలగు ఇంద్రియములద్వారా తా నెట్లు వినెనో, కనెనో, అట్లె చెప్పుటయే, సత్యశబ్దముయొక్క అభిప్రాయము. కాని తాను విన్న, కని నది, సరిగ తూచ తప్పక

యట్లే చెప్పుట అసంభవము. చక్షురింద్రియ మేదిచూచెనో కర్ణేంద్రియ మేదివినెనో, ఇట్లే మిగిలిన ఇంద్రియము లన్నియు కూడ తామనుభవించినది యనుభవించినట్లుగ యథార్థమును చెప్పజాలవు. ఇంద్రియములు విషయములందలి శక్తిని గ్రహించుటకు మనస్సులో నెట్టి శక్తికలదో, ఏపటుత్వముచే విషయమును గ్రహించుచున్నదో, అట్టిమాటలతోనే ఇతరునికి చెప్పజాలడు. కాగా తాను విని కనిన విషయములను భావము చెడకుండ స్వంత మాటలతో వెలిబుచ్చును. మనస్సులో నెట్టి మాటలు దాచరాదు. ఎట్టి మాటలతో వినిన అట్టి మాటలతోనే మరల చెప్పుట సముచితము.

> "సత్యం యథార్థే వాఙ్మనసే యథా దృష్టం
> యథా నుమితం యథా శృతం, తథా వాఙ్మనశ్చేతి,
> పరత్ర స్వబోధ సంక్రాంతయే వాగుక్తా సా యది
> న వంచితా భ్రాంతి వా ప్రతిప్రత్తి బంధ్యా వా భవేదితి"
>
> యోగ, సాధనపాదము 3. సూ.

నిశ్చల మనస్సుతో యథార్థమును చెప్పుటయే సత్యమనబడును. ఎట్లు విందువో, ఎట్లు చూచెదవో, ఎట్లాలోచించెదవో, అట్లే యితరునికిచెప్పు సమయమున బాగుగ చెప్పవలయును. విన్నది, కన్నది యెదుటవానికి తెలియునట్లు చెప్పుట సత్యమనబడును. తాను వినిన భావమునే శబ్దచాతుర్యముచే చెప్పు సమయమున యెదుటవా డన్యథా భావము చేసికొనిన సత్యమనబడదు మరియు వినినట్లే చెప్పినను ఎదుట వాని కర్థముకాకపోయినను సత్యముకాదు. కాగా తాను

విన్నదానిని విన్నటుల యెదుటవాని కర్థమగునటుల చెప్పి నదియె సత్యమనబడును.

సామాన్యముగ తా జెప్పువిషయ మెదుటవాని కర్థ మగునటుల మాట్లాడవలయును వినువాడుకూడ జాగరూ కుడై యుండవలయును. తా జెప్పువిషయమున వాక్చాతుర్య మును చూపవలె నని ఇతరమాటలు చేర్చిన భావముచెడును. తనకాలమున అసత్య దోషము సంభవించును. ఇదంతయు వాక్సారళ్యము లేనియెడల సంభవించును. సత్యదృష్టితో మాట్లాడు మనుజు డీకాలమున చాలతక్కువ. సరళహృద యముగల సత్యవాదియు దుర్లభమె.

వ్యాపారము, వివాహము, ఆపద, జాతీయకార్యము మొదలగు వానివిషయమున అసత్య దోషములేదని కొంద రభిప్రాయము.

వారిజాక్షులందు, వైవాహికములందు,
ప్రాణ విత్త మాన భంగమందు,
చకిత గోకు లాగ్రజన్మరక్షణమందు,
బొంక వచ్చు నఘము బొంద దధిప!

భాగవతము

కాని అది, ఆపద్ధర్మము గాని, సర్వథా సముచితము కాదు. సత్యదృష్టితో విచారించిన అబద్ధ మాడుమని ఎచటను లేదు. అపవాద వాక్యముల ప్రయోజనము వేఱు. ఇతరునికి కష్టము కలిగించు మాటలు కూడ ననత్యములె. 'మహాభారత శాంతి పర్వములో పదియవ యధ్యాయమున ధర్మరాజుతో భీష్ము డిట్లుపలికెను. "ఏ సందర్భమున అసత్యము సత్యమగునో,

సత్యము అసత్యమగునో, అచట సత్యము చెప్పరాదు.'' దొంగవాడు దొంగతనమునకు రాగా వానిని "ఎందుకు వచ్చితి" వని ప్రశ్నించు తఱి సత్యము చెప్పరాదు. సత్యము చెప్పిన ఎదుటవానికి ప్రత్యయబుద్ధి కలుగదు. అసత్య మాడ వలయునని ఎచటను విధి లేదు. ఈ విషయమునే ఈ అధ్యాయ మందే భీష్ముడు ధర్మరాజుతో నిట్లు పలికెను.

"సత్యస్థ వచనం సాధు నసత్యా ద్విద్యతే పరమ్'

మహాభారతము

''సత్యము పలుకుట ఉత్తమము. సత్యము కన్న ఉత్తమము మరియొకటి లేదు."

మరియు యోగదర్శనమున "ఇతరునికి హాని కలిగించు వాక్యములు పలుకరాదని'' నిషేధింప బడినది.

"ఏషా సర్వభూతోప కారార్థం ప్రవృత్తా న
భూతోప ఘాతాయ, యది చైన మప్యభిధీ
య మానా భూతోపఘాత పరైన స్యా న్న
సత్యం భవేత్,పాప మేవ భవేత్, తేన
పుణ్యా భాసేన పుణ్య ప్రతిరూపకేణ కష్ట
తమం ప్రాప్నుయాత్, తస్మా త్పరీక్ష్య సర్వ
భూత హితం సత్యం బ్రూయాత్"

యోగదర్శనము.

పై రీతిగ నిత్యజీవవితములో పలుకుచు జీవితము గడుపువాని జన్మ ధన్యము. అట్టి వాని కెప్పుడు అనిష్ట ముండదు. ఇతరునికి కష్టము కలుగునటుల మాట్లాడుట సత్యమున బడదు. అది యెంతయు పాపాచరణమె. ''నేను సత్య

ము నే మాట్లాడు చుంటిని. అందువలన నేను పుణ్య ఫలమును అనుభవించుచుంటిని. నేచేయు పనులు సత్యములు" అను నభిమాన మెన్నడు కూడదు. ఈ యభిమానము పాపమునకు దారితీయుటయే కాక చివరకు నష్టము, తన్మూలమున కష్టమును కలిగించును. ఈ కారణముచే మిక్కిలి జాగరూకతతో మాట్లాడుచు, ఇతరునికి కష్టము కలిగించకుండ సాధ్యమైనంతవరకు హితము కలుగుటకు యత్నించుట మానవుని ముఖ్య ధర్మము.

"సత్యం భూతహితం ప్రోక్తం నాయథార్థాభి భాషణమ్"

యాజ్ఞవల్క్యుడు.

ప్రాణులకు హితమగునట్లు యథార్థము పలుకుటయే సత్య మనబడును.

"సత్యం బ్రూయాత్ ప్రియం బ్రూయాత్
నబ్రూయాత్ సత్య మప్రియమ్"

మనుస్మృతి.

సత్యమును ప్రియమును మాట్లాడుము. అప్రియమును సత్యమైనను పలుకవలదు.

కాబట్టి పరుని హితమును కోరి, సరళహృదయముతో సాధ్యమైనంతవరకు యథార్థమునే మాట్లాడ వలయును. ఇదియే సత్యము.

ధర్మద్వయము; కర్తవ్యము:—

ఏక కాలమున అతిక్రమించుటకు శక్యముగాని రెండు ధర్మములు సంభవించును. అప్పు డేమి చేయ వలయును? "ఒకగోవు పరుగెత్తినది. దానివెంబడి ఒక కసాయి దానిని చంపుటకు వచ్చుచుండెను. ఆవు పొదలోదూరెను". ఈదృశ్య

మొకడు చూచెను. కసాయి వచ్చి, "గోవు, ఎటు పోయినది?" అని ప్రశ్నించెను గోవు పోయినవిధము చెప్పిన అన్యాయముగ ఆవు మరణించును. తన్మూలమున హింస సంప్రాప్తించును. చెప్పకుండిన అసత్య దోషము సంభవించును. ఇట్టి సమయమున చేయతగిన దెద్ది?

సత్యవ్రతుడు;—

ఋషికుమారు డొకడు గంగాతీరమున నిర్జనవనములో తపమాచరించు చుండెను. అత డెల్లపుడు సత్యమునె పలుకును. ఈ కారణమున అతనికి 'సత్యవ్రతు, డనినామము స్థిరమాయెను. సత్యవ్రతు డెట్టి సమయములోను అబద్ధ మాడడు.

ఒకనాడు నిశరుడను వ్యాధు డొకడు బాణము సూకరమును కొట్టి, దానిని తఱుముకొని రాగా, ఆపంది సత్యవ్రతుని ఆశ్రమ ప్రాంతమున దాగి యుండెను. ఇంతలో వ్యాధు డేతెంచి మునినిగూర్చి యిట్లు పలికెను. స్వామీ! "నా బాణపు దెబ్బతినిన సూకర మేదిశగ పోయినది? తాము సత్యమునే పలుకు సత్యవ్రతులు. నానిత్య జీవిత యాత్ర యిట్లే గడచును. నేడా సూకరము లభింపక పోయిన నా కుటుంబము ఆహారము లేక మలమల మాడును. కాన యథార్థము సెలవిండు." అని పలికెను. సత్యవ్రతునకు సూకరముయొక్క విషయము తెలుసును. వ్యాధుని వాక్యములు వినిన ధర్మ సంకటము కలిగినది. సత్యాహింసలయొక్క పరీక్ష సమయము. సూకర మున్న తావు చెప్పిన పంది, మరణించును. తన్మూలమున హింస సంప్రాప్తించును. చెప్పకుండిన అసత్య దోషము చుట్టుకొనును. "ఏసత్యమున హింస కలదో అదిసత్య మెన్నటి

కిని కానేరదు. దేనిలో దయ కలదో అదే సత్యము. జీవుల కేది హితమో అదే సత్యము. మిగిలిన దంతయు నసత్యమే" ఈ రీతిగ విమర్శించి చేయునది కానక, పరమేశ్వరిని హృదయమున ధ్యానించి యిట్లు పలికెను.

"యా పశ్యతి నసాబ్రూతే యా బ్రూతే సా నపశ్యతి,
అహో వ్యాధ! స్వకార్యార్థిన్ కింపృచ్ఛసి పునఃపునః"

దేవీభాగవతము.

చూచుదాని (కన్ను) కిచెప్ప శక్తిలేదు. చెప్పెడిదాని (నోరు) కిచూచు శక్తిలేదు. స్వార్థము నపేక్షించిన ఓవ్యాధుడా? నన్ను ఏమని చెప్పుమనెదవు? ఈమాటలు విని వ్యాధుడు వెడలిపోయెను. యథార్థమున మునిచెప్పినది మిక్కిలి సమంజస ముగనున్నది. కన్ను చూచింది చెప్పలేదు. నోరు చెప్పింది చూడలేదు.

కాబట్టి ఇట్టి ధర్మసంకటము వచ్చినపుడుగూడ నబద్ధ మాడక యథార్థమునే పలుకవలయును. వాడె అహింసా ప్రియుడు. "గోవు పారిపోయిన దెస నాకు తెలుసును. కాని చెప్పను" ఇట్టిసమయమున కసాయి, వానిని చంపినను భయము లేదు. ఇదే విధముగ సతీత్వరక్షణ విషయమునను, దొంగ వాని విషయముననుగూడ "నాకు తెలుసును. నేను చెప్పను". ఇట్లు పలుకుటవలన యెదుట వానివలన అత్యాచారము (మరణము) సంభవించినను దోషము లేదు. ఇట్టితరి కొన్ని స్థలములయందు నబద్ధ మాడిననూ దోషము లేదని శాస్త్రములు చెప్పుచున్నవి.

"ఆత్మార్థే వా పరార్థే వా పుత్రార్థే వా పి మానవాః
అనృతం యే న భాషంతే తే బుధాః స్వర్గ గామినః"

స్వ విషయమున గాని, పర విషయమున గాని, చివరకు పుత్రుని విషయమున గాని ఎవ డబద్ధ మాడడో, అట్టివాడు స్వర్గమును పొందును. కాబట్టి యెన్నడసత్య మాడరాదు. సత్యము పలుకువాడసత్యము మాట్లాడుటకంటె మృత్యువును ఆలింగనము చేసికొను టుచితము.

నిత్యము సత్యమునే పలుకు వాని కొకానొక, సమయమున నిరపరాధి విషయమై, గొప్ప పుణ్యకార్యము జరుగు విషయమై అసత్యము పలుక వలసి వచ్చిన ఆపాపము వానికి సంభవించును. ఎదుట వాని ప్రాణరక్షణము. సత్యవాక్యము రెండును ప్రధానములే, ఇట్టితటి స్వార్థ మును విడచి రెండింటిని సమదృష్టితో చూచి, భగవంతుని స్మరించి తనబుద్ధికి తోచినది చేయువలయును. అట్టి తటి కర్తవ్యాంశమును మనస్సున భగవంతుడే నిర్ణయించును.

తనబుద్ధి సందేహముగ నున్న విద్వాంసుని గాని, సాధు పురుషుని గాని అడుగవలయును. విద్వాంసుని కన్న సాధువుని యందే అధిక మహాత్వము గలదు. గాన సాధుపురుషుని వాక్యానుసారము చేయుట మంచిది.

భగవద్గీత—సత్యసిద్ధాంతము:

భగవద్గీత యంతయు వాఙ్మయ తపస్సుగ చెప్ప బడినది. దాని సారమంతయు నొక శ్లోక మునచెప్ప బడినది. ఇదియే సత్యమునకు ప్రధానాధారము. కేవల వాక్ తపమాచరించిన అన్ని తపస్సులు చేసిన ఫలము కలుగును.

"అనుద్వేగ కరం వాక్యం సత్యం ప్రియహితం చ యత్
స్వాధ్యాయా భ్యసనం చైవ వాఙ్మయం తప ఉచ్యతే"
గీత-17 అ.

ప్రాణులకు దుఃఖము కలిగింపకుండగను, సత్యముగను, ప్రియముగను, హితముగనుపలుకుటే వాఙ్మయ తపము. వేదాధ్యయనఫలమును అదియే.

అవసరము లేనిదే మాట్లాడ రాదు. మితముగను, ఎదుటి వాని కుపయుక్తముగను తక్కువగను మాట్లాడ వలయును. ఇతర సమయములను భగవత్సంబంధముగ కాలమును సద్వినియోగ పఱచ వలయును. ఇదియే యదార్థమగు సత్యము.
కింకర్తవ్యం?—

ప్రస్తుత కాలమున సరళ హృదయులుగాని, యథార్థము మాట్లాడు వారు కాని లేరు. అసత్యమువలన వాక్కుయొక్క ప్రభావము నశించును. ప్రాచీన కాలమున శిక్షితులుగాని, అశిక్షితులుగాని, ఎవరైనను సరే ఆబాల గోపాలము పలుకు మాటలు సత్యముగనే జరిగెడివి.

వర్తమాన జగమున సత్యఫలము కానరాదు. సర్వకాలములయందు స్వార్థ మధిక మైనది. వ్యర్థ సంభాషణ వృద్ధియైనది. ఎంతటి యసత్యమునైనను పలుకుటకు లోకము వెనుదీయుట లేదు. అసత్యమువలన వాక్కు యందలి శక్తియే కాక, పరమార్థ సాధనా శక్తియు సన్నగిల్లును. విశ్వాసము ప్రత్యయ బుద్ధియు నశించును.

నీతిశాస్త్రవేత్తలు, "సత్యం పూతం వదేత్ వాక్యమ్" (సత్యము పూతము అగు వాక్యమునే పలుక వలయును. అని

పలికిరి. బాగుగ ఆలోచించి మాట లాడు చుండవలెను. ఆశీర్వాద రూపమగు శాప మెవరికిని యియ్యరాదు. ఇందువలన వాక్కు వ్యర్థమగుటయే గాక, ప్రతిశాపము, తాపము, విరోధము మొదలైనవి యధిక మగును. ప్రతిజ్ఞాపూర్వకముగ పలుకరాదు. పూర్వ మొకప్పుడు ధర్మ రాజిట్లు పలికెను. "రేపు ఒకానొక పని చేయుదును" సత్యసంధుడగు ధర్మరాజు వాక్యము రేపటివరకు సత్యమని భావించి భీముడు సంతసించినాడు. కాబట్టి సాధ్యమైనంతవరకు ప్రతిజ్ఞా పూర్వకముగ పలుకరాదు.

పూర్వోక్తవిషయములన్నియు బాగుగ నాలోచించి ఆడంబరముగ మాట్లాడరాదు. బాహ్యమునకుచూపునదిసత్యము గాదు. హృదయమున సత్యముగ సత్యము స్థిరము కావలయును. చతురతగల మాటలలో గంభీరార్థ ముండును. ఒక మాట పలికిన, మరియొక యర్థము వచ్చును. హృదయమునందెట్టి భావ ముంచుకొని వాక్యముపలుకునో ముఖమునుండి వెలువడిన పలుకులలోగూడ నట్టి యభిప్రాయమె ధ్వనించును. దానినే కపట మందురు. ఇట్టిపలుకులు సత్యమన బడవు. ఇట్టి డంబాచారమువలన పరమాత్మ ప్రసన్నము గాదు. కొందరు వ్యర్థపు మాటలుపలికి లోకమునకు దుఃఖము గూడ కలిగించుదురు. ఇట్టి మనుష్యులు "మేము సత్యమునే పలుకుచుంటిమి. నీ కవి విపరీతార్థ మైనవి. దానికిమేము కర్తలముగాము" అని పలుకు చుందురు. ఇట్టివారికి యమ దూతలవలన నెట్టి బాధలు కలుగునో!

# అక్రోధము

మానవ ధర్మములలో పదియవది అక్రోధము. అక్రోధ మన కోపము లేకుండుట. వ్యతిరేక కార్యాచరణమువలన మనస్సున కోపము పుట్టును. కోపసమయమున కర్తవ్యాకర్తవ్య విచక్షణ నశించును.

"త్రివిధం నరకస్యేదం ద్వారం నాశన మాత్మనః,
కామః క్రోధ స్తథా లోభ స్తస్మా దేతత్త్రయం త్యజేత్"

గీత 16-12

కామ, క్రోధ, లోభములు ఆత్మ పతనమునకు కారణ ములు; నరక ద్వారములు. కాన బుద్ధిమంతు డీమూటిని విడువ వలయును. క్రోధము మానవుని నశింప జేయును. క్రోధము నకు వశుడైనవాడు పాపాచరణమునకు, గురువుల నవమానిం చుటకు, మహాత్ముల దిరస్కరించుటకు వెను దీయడు. మఱియు నెప్పు డెట్టి వాక్యములు పలుక వలయునో తెలియకుండగ ననేక విధములుగ పలుకు చుండును. క్రోధము పరుని చంపిం

చును. ఆత్మహత్య చేయించును. గాన క్రోధము విడచుట ఉత్తమ లక్షణము.

క్రోధ మనేక విధములగు పాపములకు మూలము. కోపము వలన గలుగు దుఃఖ మిట్టిదని చెప్పుటకు శక్యముగాదు. కోపము వచ్చిన వాని యాకారము భయంకరముగ నుండును. శరీరకంపము, రోమాంచము, కటువగు దుర్భాషలు, నిర్దయ, భయంకర దృష్టి కలిగియుండును. అకారణముగ ఉత్తములను దూషించును. వారల కహిత మాచరించును. పరున కపకారము కలుగజేసి కోపము కలిగించును. వాడు దుర్బలుడైన హత్యగూడ గావించును. బలము కలవాడగుచో నొక్కొక్కపుడు తానే ఆత్మహత్య గావించుకొనును. ఉత్తముడు కూడనట్లు కోపమునకు గురియై చివరకు తనకు తానే పాపకూపమున బడును.

"క్రోధః ప్రాణహరః శత్రుః క్రోధోఽమిత ముఖో రిపుః
క్రోధోఽసిః సుమహా తీక్షణః సర్వం క్రోధోఽప కర్షతి,
తపతే యతతే చైవ యచ్ఛదానం ప్రయచ్ఛతి
క్రోధేన సర్వం హరతి. తస్మాత్ క్రోధం వివర్జయేత్"

వామన పురాణము

క్రోధము ప్రాణమును హరించుశత్రువు క్రోధము తీక్షమైన ఖడ్గము. తపస్సు, దానము, సంయమము, మొదలగున వెన్నిపనులు చేసినను కోపమున్న అన్నియు నశించును. కాబట్టి కోపమును విడువ వలయును.

మనస్సుకు వ్యతిరేకమైన మాటలను సహించు టలవాటు చేసిన క్రమముగ కోపము సన్నగిల్లును. ఇతరుల మన

స్సున కనుకూలమగు కార్యము లాచరించిన లోకమున కంత టికి కల్యాణము చేకూర్చిన వా రగుదురు. కోపమును నశింప జేయ వలయునను అభిప్రాయము గలవాడు తాను లోక మునకు వ్యతిరేకముగ నడుచుటగాని, కఠిన వాక్యములు పలు కుటగాని, అపచార మొనర్చుటగాని చేయ రాదు. ప్రతికూల భావముగల లోక విషయమున తాను ప్రేమ భావము కలిగి మెలగిన క్రమముగ వారుగూడ తన స్థితికి రాగలరు. కటు సంభాషణకు దూరముగ నుండవలయును. మంచిమాటలు విను లోకము తక్కువ. ఒక్కడు వినినను చాలు. తా జెప్పు మంచిమాటలు వినుటె ప్రధానమని భావించ వలయును గాని ఎదుటి వాని యందలిదోష విమర్శ పనికిరాదు. దోషవిమర్శ యాగ్రహమునకు మూలకారణము. ఇది సర్వత్ర సహజము. అకారణముగ నెదుటి వాడాగ్రహించి నపుడు చేయతగిన దెద్ది?—ప్రేమ భావముతో శాంతి వాక్యములు పలుక వల యును. వాని కోపమును తగ్గించమని దీనభావముతో పర మేశ్వరుని ప్రార్థించ వలయును. లేక యెదుటివాని కోపము నకు ప్రతీకారముగ దానుగూడ కోపగించిన పరస్పరము ద్వేష మావిర్భవించును. లోకమున కోపము లేకుండ నశింప చేయుటకు యత్నించు వాని హృదయముకూడ కళంకిత మగును. పరదోష దర్శనమునకై యత్నించును. పరదోషము లను లోకములో ప్రచారము చేయు టారంభించును. ఇట్టి వాని నిత్య జీవిత మంతయు పాపమయమై, సన్మార్గమునుండి పతి తుడై ఎదుటివానిని విరోధిగా బరిగణించును. నాడుభయులు సమాన వైరము గలవారై, హింస ప్రతిహింసలకు గడంగు

దురు. పరస్పరము దోష ఛిద్రాన్వేషణమునకు దారితీయు దురు. పరుల దోషమును వెతుకుట మానవునికి తగనిపని.

దోష చ్ఛిద్రములు వెతుకుటవలన పరస్పరము వైర మావిర్భవించును. లోకమున కోప రాహిత్యమునకు ప్రచారము చేయు వానికి స్వార్థ ముండకూడదు. స్వార్థము వలన పరహితము దూరమగును. స్వార్థమువలన కోపము జనించును. దానివలన నథఃపతితుడగును. కాబట్టి, ప్రచారము చేయువాడు స్వార్థమును పూర్తిగ త్యజించవలయును.

"సంచితస్యాపి మహతో వత్స క్లేశేన మానవైః,
యశస స్తపస శ్చైవ, క్రోధో నాశకరః పరః"

విష్ణుపురాణము I, 1.22

వత్సా! మిక్కిలి కష్టముతో సంపాదించిన కీర్తి, తపము కోపమువలన నశించును.

కొందరు కోపమును పరాక్రమ మనియు, అది యుండుట మంచిదనియు నందురు. ఇదిసముచితము కాదు. హింస, ద్వేషములు కోపము నకు మూలములు. కోపము మనుష్యుని స్వభావము కాదు. కోపము పశుధర్మము. కోపమే పరాక్రమమైన ఇతరునకు కష్టము కలుగరాదు.

ఈ విషయమున ధర్మరాజిట్లు చెప్పెను. దాక్షిణ్యము శూరత్వము, తత్పరతయు నివి పరాక్రమ గుణములు. ఈ గుణములున్నను, కోపముగలిగిన, కర్తవ్యజ్ఞానముండదు. క్రోధము రజోగుణ పరిణామము. క్రోధము దుర్గుణములకు పెన్నిధి. సంసార యాత్రలో కోపము లేనియెడల పాపాతులను దండిం

చుట యెట్లు? లోకమున పాపదండన లేకపోయిన అత్యాచారము లధికమై జగమంతయు దుఃఖమయ మగును. మఱియు దుర్మార్గులయొక్కయు, చోరుల యొక్కయు సంఖ్య నధికమగును. గాన కోప ముండవలయు నని కొంద రందురు. యథార్థమున కోపము మానవుని స్వభావమా? కాదు. సమయమును బట్టి కోపము పుట్టును. కోప సమయమున జగమంతయు దోషముగనే కనుపించును. గుణ దోషముల విభాగము కానరాదు. దోషము నాచరించుటకు సంసిద్ధమై ఆచరించి తీరును. ఇట్టి సమయమున కోపముగల వానిని సమీపించి సరళములు, శాంతములు నగు వాక్యములచే వాడి కోపమును నశింప జేయ వలయును.

న్యాయవిచారణ చేయు వాడెన్నడు కోపమునకు గుఱి కాగూడదు. కోపమున్న వాడు న్యాయ విచారణ యెట్లు చేయగలడు? [illegible] వాని శిక్ష న్యాయ మెట్లగును ? వాని విచారణ హింస ప్రతిహింసలతో కూడి యుండును. హింస ప్రతిహింసలు అశాంతికి కారణములు. కాన న్యాయాధికారికిని కోపము పనికిరాదు. న్యాయముతో కూడిన క్రోధము సముచితము.

"యత్ క్రోధనో యజతి యచ్చ దదాతి నిత్యమ్
యద్వా తప స్తపతి యచ్చ జుహోతి తస్య
ప్రాప్నోతి నైవ కిమపీహ ఫలం హి లోకే
మోఘం ఫలం భవతి తస్య హి కోపనస్య"

వామన పురాణము

యజ్ఞ యాగాది కర్మలు, దానములు, తపస్సు మొదలగునవి నిత్యము భక్తి శ్రద్ధలతో చేసినను, కోపమున్న అవియన్నియు వ్యర్థమె. ఫల మెంతమాత్ర ముండదు.

—; క్రోధమును జయించు నుపాయములు ;—

1. కోపము కలిగి నప్పుడు ఐదు నిముసములైనా మాట్లాడకుండు నట్లభ్య సించ వలయును.

2. పెద్దల యెడ కోపము కలిగిన వెంటనె వారి పాదముల మీద బడి నమస్కరించ వలయును.

3. అందరియందు భగవంతుని చూచు నభ్యాసము చేయ వలయును. నాడు భగవంతుని యెడ కోప మెట్లు కలుగును ?

4. అందరిని తన (ఆత్మ)వలె భావించ వలయును. తనపై తనకు కోపము రాదుగదా !

5. ఎవరైనా ఒక విషయము చెప్పినపుడు, క్రోధము కల్గిన "ఆవిషయము సరిగ నున్నదా? లేదా? యని ఆలోచించ వలయును. బాగున్నచో క్రోధము కలుగుట కవకాశమే లేదు. ఎవరైనను మనయందున్న దోషమును బయట పెట్టిన మన కుపకారము జేసిన వారగుదురు. మన నిజ స్వరూపమును లోక మునకు వ్యక్త పఱచిన వారగుదురు. అసత్యమగు దోషారోపణ చేసినచో వారు పొరబడినట్లు తలచ వలయును. ఈ రెండు తరగతుల వారు దయకు పాత్రులె. ఎట్లు చూచినను క్రోధమునకు తావే లేదు గదా! అనుక్షణ మీరీతిగ నాలోచించుట యభ్యాసము

చేసినచో కోపము కలుగుటకు తనంత కారణ మున్నను, కోపము కలుగక శాంతించును.

6. అహంకార మనెడి మదమును వదలుట కభ్యాసము చేయ వలయును.

7. క్రోధమును ఎల్లపుడు దుర్గుణముగను, అధోగతి పాలు చేయునది గను భావించ వలయును.

8. కోపమువలన దుర్గతి జెందిన వారి చరిత్రలు తఱచు చదువ వలయును.

9. దిన చర్య వ్రాసికొను గ్రంథము (డైరీ) న కోపము కలిగిన సమయములను వ్రాసి, రాత్రిపరుండ బోవునపుడు చూచు కొని నాడు తనకెన్ని పర్యాయములు కోపము కలిగినది తెలిసికొని, పశ్చాత్తాప మంది ఇక ముందెన్నడును కోపము కలుగకుండుటకై భగవంతుని దీనాతి దీనముగ ప్రార్థించ వలయును. అందులకు భగవత్సాహాయ్యమును అర్థించ వలయును.

10. పై విధముగ నిత్యము ఉదయమున గూడ దైవమును ప్రార్థించ వలయును.

11. కోప మావిర్భవించి నపుడు భగవన్నామమును స్మరించ వలెను. కొన్ని అంకెల నైనా లెక్కించ వలయును. భగవన్నామమును లెక్కించుచు స్మరించ వలయును. కోపము కలిగిన రోజున ఆహారము తగ్గించ వలయును. లేదా ఒక పూట భోజనము మాన వలయును.

ఇది మనువుచే చెప్పబడిన మానవుని దశవిధ ధర్మములయొక్క సంక్షిప్త వ్యాఖ్యానము. ఈ ధర్మముల ననుసరించి తమతమ జీవితములను, సార్థకముగను పవిత్రములుగను జేసికొందురు గాక !

"దంతంబు ల్పడనప్పుడే తనువునం దారూఢి యున్నప్పుడే
కాంతాసంఘము రోయనప్పుడె జరాక్రాంతంబు గానప్పుడే
వింత ల్మేన,జరింపనప్పుడె కురు ల్వెల్వెల్ల గానప్పుడే
చింతింప న్వలె నీపదాంబుజములన్ శ్రీకాళహస్తీశ్వరా!"

శ్రీ కాళహస్తీశ్వర శతకము

ఓంతత్సత్



నలందా ప్రెస్, మారీసుపేట, తెనాలి.